ఫిల్మ్‌నగర్

# ఆశ నెరవేరేనా..?

**కమల్‌హాసన్ కూతురిగా కాకుండా, కేవలం తన టాలెంట్‌తో స్టార్ హీరోయిన్‌గా గుర్తింపు తెచ్చుకుంది శృతిహాసన్. అయితే తొమ్మిదేళ్లుగా ఆమె ఒక్క హిట్ కోసం బాలీవుడ్‌లో పోరాటం చేస్తూనే ఉంది. 2017పై ఎన్నో ఆశలు పెట్టుకున్న శృతి గురించి కొన్ని విశేషాలివి...**



## తూర్పు పడమర

శృతిహాసన్‌కు ఇంట్లోనే శత్రువు ఉందట. చిన్నతనంలో చెల్లెలు అక్షరహాసన్‌తో ఆమె పడ్డ కష్టాలు అన్నీ ఇన్నీ కావు. కోతిపనులన్నీ చేసి, అమాయకంగా ముఖం పెట్టి, అక్కపైకి నెట్టేసేదట అక్షర. అయితే నాన్న సపోర్టు మాత్రం శృతికే ఉండేదట. సకల కళావల్లభుడైన కమల్‌హాసన్‌లోని ప్రతిభను వీరిద్దరూ పంచుకోవడం విశేషం. శృతి ఇప్పటికే గాయనిగా కూడా పేరు తెచ్చుకుంటే... అక్షర రచన, దర్శకత్వం వైపు దృష్టి సారిస్తోంది. ఎప్పటికైనా అక్షర ఓ సినిమా డైరెక్ట్ చేస్తుందని ధీమాగా చెబుతోంది శృతిహాసన్.




## ఇంకా 'లక్' కలిసిరాలేదు...

దక్షిణాదిన స్టార్ హీరోయిన్‌గా పేరున్న శృతిహాసన్, బాలీవుడ్ 'లక్'తో తెరంగేట్రం చేసిన విషయం తెలిసిందే. విచిత్రమేమిటంటే తెలుగు, తమిళ రంగాల్లో హిట్ సినిమాలు చేసిన శృతికి బాలీవుడ్‌లో ఒక్కటంటే ఒక్క హిట్ కూడా లేదు. బాలీవుడ్‌లో ఇప్పటిదాకా ఆమె నటించిన చిత్రాలన్నీ ఫ్లాపులే. తాజాగా రాజ్‌కుమార్ రావ్ సరసన 'బెహెన్ హోగీ తేరీ' సినిమాలో నటిస్తోంది. జూన్ 2న విడుదల కాబోతున్న ఈ సినిమాపైనే ఆశలన్నీ పెట్టుకుంది శృతి.



## 'రెడ్ కార్పెట్' స్వాగతం

ఈ యేడాది శృతిహాసన్‌కు ఊహించని ఆహ్వానం అందింది. ప్రసిద్ధ 'కేన్స్' ఫిల్మ్‌ఫెస్టివల్‌లో శృతి రెడ్‌కార్పెట్‌పై నడుస్తోంది. తమిళంలో శృతి నటిస్తున్న భారీబడ్జెట్ చిత్రం 'సంఘమిత్ర' ప్రమోషన్‌లో భాగంగా ఆమెకు ఈ అదృష్టం దక్కింది. ఒకేసారి మూడు భాషల్లో తమిళ దర్శకుడు సుందర్.సి తీస్తున్న ఈ మెగా యాక్షన్ డ్రామాకు ఎ.ఆర్.రెహమాన్ సంగీతాన్ని అందిస్తున్నారు. ఈ సినిమా కోసం శృతి యుద్ధవిద్యలు కూడా నేర్చుకుందట.



## నాన్నకు 'నో' కాల్షీట్స్...

ఎంతోమంది స్టార్ల సరసన నటించినప్పటికీ 'శృతిహాసన్ తండ్రి సరసన ఎప్పుడు నటిస్తుంద'నే ఆసక్తి అందరిలోనూ ఉంది. కెరీర్‌కు సంబంధించి ప్రతీ విషయంలోనూ స్వంతంగా నిర్ణయం తీసుకునే శృతిహాసన్‌ను ఇదే ప్రశ్న అడిగితే " ఇప్పటిదాకా అలాంటి ఆఫర్ ఏదీ నాకు రాలేదు. అయినా నా సినిమాలతో నేను, తన (కమల్‌హాసన్) సినిమాలతో తను బిజీగా ఉన్నాం కదా. నిజానికి ఇప్పట్లో నాన్నకు కూడా కాల్షీట్లు ఇవ్వలేనంత బిజీగా ఉన్నాను" అంటోందీ సుందరి.

# INSIDE





**సరికొత్త కొలమానం 'ఇంపాక్ట్ ఇండెక్స్'**

క్రికెట్ రికార్డులను కొత్త కోణాలలో చూస్తుంది 'ఇంపాక్ట్ ఇండెక్స్'. ఎన్ని పరుగులు చేశారన్నది కాదు, ఏ పరిస్థితుల్లో చేశారన్నదే ముఖ్యం అంటుంది కొలమానం. 7




**అనసూయ భరద్వాజ్**

చిన్నితెరపై 'జబర్దస్త్' క్రేజ్ సంపాదించుకున్న అనసూయ తన గ్లామర్‌తో సినిమాల్లో కూడా అడుగుపెట్టింది. తనపై పాట రావడం గ్రేటేనంటూ అనసూయ చెప్పిన ముచ్చట్లు. 12

మీ అభిప్రాయాలను పోస్టు ద్వారా **ఆదివారం ఆంధ్రజ్యోతి**, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33కు, మెయిల్ ద్వారా sunday.aj@gmail.comకు పంపండి.



## మిత్రవాక్యం

పిల్లాడికి మంచి మార్కులొస్తే పిజ్జా తెప్పించుకోమంటూ ఉదారంగా అనుమతి ఇచ్చేస్తాం. సినిమా థియేటర్లో కాలుపెట్టగానే 'చిప్స్ కావాలా, కూల్‌డ్రింక్ కావాలా?' అంటూ కుటుంబ సభ్యులకు బంపరాఫర్ ప్రకటిస్తాం. ఏ పని మీదో బయటికి వెళ్లిన పుడు... ఆకలిగా అనిపించినా, కాసేపట్లో ఆకలేస్తుందేమో అన్న అనుమానం వచ్చినా ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లోకి దూరిపోతాం. ఆ తిళ్లన్నీ హానిచేస్తాయని తెలి సినా... వాటివైపే మొగ్గుచూపుతాం. ఇవన్నీ 'ఉద్వేగం'తో తీసుకునే నిర్ణయాలే. ఉద్వేగం నెత్తినెక్కికూర్చున్నప్పుడు, వివేకాన్ని అస్సలు పట్టించుకోం. ఫలహారాలైనా, భోజనాలైనా - తిండికి సంబంధించినంత వరకూ రెండు రకాల ఎంపిక పద్ధతులు ఉంటాయి. ఒకటి... ఉద్వేగ భోజనం (ఎమోషనల్ ఈటింగ్), రెండోది... ఎరుకతో కూడిన భోజనం (మైండ్‌ఫుల్ ఈటింగ్). ఎరుకతో తింటున్నప్పుడు ఆహారంలోని అణువణువునూ మనసు స్కాన్ చేస్తుంది. అందులోని కెలోరీల్ని లెక్క గడుతుంది, రసాయనాల ఆనవాళ్లను కనిపెడుతుంది. 'ఈ చెత్తంతా ఇప్పుడు అవసరమా?' అని మనల్ని నిలదీస్తుంది. ఆ సమయంలో ఉద్వేగాన్ని కనుక దగ్గరికి రానిచ్చామా...అంతే సంగతులు! పొట్టను చెత్తకుండీలా మార్చేదాకా వదిలిపె ట్టదు. ఆరోగ్యం జాగ్రత్త! ఆహారం జాగ్రత్త!!



## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### ◆ గుర్తుంచుకుంటాం !

ఈ వారం కవర్‌స్టోరీ 'ప్చ్... మర్చిపోయా!' చాలా బాగుంది. ఆహార అలవాట్లు మారడం, వాతావరణ కాలుష్యం, రోజువారీ కార్యకలాపాల్లో వచ్చిన మార్పులు, పని ఒత్తిడి... కారణమేదయినా 'భలేభలే మగాళ్ల' సంఖ్య విపరీతంగా పెరుగుతోంది. నిన్న తిన్న కూర పేరు అడిగితే కూడా, రెండు నిమిషాలు ఆలోచించి, 'ప్చ్... మర్చిపోయా!' అనేస్తుంటాం. మొబైల్ ఫోను మతిమరుపును తోడుగా తెచ్చిందేమో అనిపిస్తుంది. మనం పెద్దగా పట్టించుకోని మతిమరుపు సమస్య తీవ్రత గురించి, దాన్ని తగ్గించుకునేందుకు తీసుకోవాల్సిన చర్యల గురించి రచయిత వివరించిన తీరు చాలా బాగుంది.

**- మహాలక్ష్మి,** హైదరాబాద్

### ◆ గోదారి గోపాలుడు

గోదావరి తీరం ఎంత అందంగా ఉంటుందో తెలుసుకోవాలంటే... వంశీ సినిమాలు చూస్తే సరిపోతుంది. ఆ నదితో పెంచుకున్న అనుబంధం, వంశీని గోదారి గోపాలుడిని చేసింది. 'అస్తిత్వం కోల్పోతేనే ఆనందం' అంటూ వంశీ చెప్పిన విశేషాలు, ఆయన సినిమాల్లానే చాలా బాగున్నాయి. వంశీ కొత్త చిత్రం 'ఫ్యాషన్ డిజైనర్' కూడా విజయవంతం కావాలని ఆశిస్తున్నాం.

**- నెమలిదిన్నె రమణారెడ్డి,** అద్దంకి

### ◆ ప్రకృతితో ప్రయాణం

తనను తాను మరిచిపోయి పరిసరాలలో, ప్రకృతిలో మమేకమై కాలంతో ప్రయాణిస్తూ పొందే ఆనందానికి, అనుభూతులకు హద్దులు ఉండవు. సరిహద్దులు కనిపించవు. 'నువ్వూ-నేనూ- ప్రకృతీ' కథ చదువుతున్నంతసేపు ప్రకృతి అందాలకు ఎంతగా దూరం అవుతున్నామో అర్థమైంది.

**- ఎం. బిందుమాధవి,** ఈమెయిల్

### ◆ నవ్వుల రాజులు

'కమెడియన్లు నవ్విన వేళ...' కథనం ఆసక్తికరంగా ఉంది. ప్రపంచ నవ్వుల దినోత్సవం రోజున కమెడియన్లు నవ్వుకున్న సందర్భాలను చదివి, మేమూ హాయిగా నవ్వు కున్నాం. మెనూ కార్డుతో బోలెడు వంటకాలను అందిస్తున్న మల్టీప్లెక్సుల గురించి తెలుసుకుని ఆశ్చర్యపోయాం. విందూ వినోదం కలిస్తే ఆ కిక్కే వేరు!

**- ఎస్. జగన్ మోహన్,** సోమల

### ◆ అభయ నరసింహ

ఉగ్రరూపం భజేహం... నమో నారసింహం! చిట్టి ప్రహ్లాదుడి భక్తికి మెచ్చి సగం నరుడిగా, సగం మృగంగా అవతరించిన మహావిష్ణు రూపం నరసింహుడు. ఏటా 'నరసింహ జయంతి'ని పండుగగా జరుపుతారని కూడా చాలామందికి తెలియదు. 'దైవమ్' శీర్షిక ద్వారా ప్రతీ వారం దేవతామూర్తుల విశేషాలు తెలుసుకునే అవకాశం కలిగింది.

**- సొల్లేటి ఉపేంద్రాచారి,** సూర్యాపేట




# ధైర్యమా లక్ష్మీ... 'రికార్డింగ్' కంపెనీలు!

ప్రపంచంలోనే ఎత్తయిన మనిషి, అందరి కంటే పొట్టి... పెద్ద పర్వతం, లోతైన నది, మహా నగరం, అతి చిన్నపల్లె, ఎక్కువ దూరం నడిచిన వ్యక్తి, ఎక్కువ టాటూలు వేయించుకున్న యువతి... ఇలా విషయం ఏదైనా, ఎంతోకొంత వింతయితే చాలు... ఏదో ఓ రికార్డు పుస్తకం ఎక్కాల్సిందే. నిన్నటి దాకా గిన్నిసే గతి. ఇప్పుడు, అనేక వేదికలు...

## లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్

'భారతీయుల గిన్నిస్'గా పేరుతెచ్చుకుంది. రాజస్థాన్‌కు చెందిన ఆయూషీ పుట్టుకతో అంధురాలు. పట్టుదలతో పంధొమ్మిదేళ్లకే ఎల్ఎల్‌బీ, ఇరవై ఒక్క సంవత్సరాలకే ఎల్ఎల్ఎమ్ పూర్తిచేసింది. బార్ కౌన్సిల్ ఆఫ్ రాజస్థాన్‌లో చేరిన మొట్టమొదటి అంధురాలిగా 'లిమ్కాబుక్'లో చోటు సంపాదించింది. లక్నోకు చెందిన అరుణిమా సిన్హా రైల్లో వెళ్తున్నప్పుడు దొంగలు ఆమెను బయటికి తోసేశారు. ఆ సంఘటనలో ఓ కాలు పోగొట్టుకుంది. ఆ తర్వాత పెట్టుడు కాలితోనే ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించి రికార్డు సృష్టించింది. ఇలాంటి స్ఫూర్తిదాయక గాథలు 'లిమ్కా'లో అనేకం.




## యునీక్ వరల్డ్ రికార్డ్స్

ఇది భారతీయ సంస్థే అయినా, ప్రపంచ రికార్డుల్నీ నమోదు చేస్తుంది. అద్భుతమైన వాస్తవాలు, అతి పెద్ద వ్యాపారాలు, అరుదైన వస్తువుల సేకరణ, అపార సృజనాత్మకత, అసాధారణ ప్రతిభ... ఇలా అనేక అంశాల్ని రికార్డు చేస్తుంది. ఆ వివరాలతో ఏడాదికో కొత్త పుస్తకం విడుదల చేస్తుంది. ఆయా విజేతలనూ సత్కరిస్తుంది. ఓ జంట వేదమంత్రాలకు బదులుగా, భారత రాజ్యాంగ ప్రవేశిక చదువుతూ పెళ్లి చేసుకుందట. విజయ్‌సింగ్ అనే పెద్దమనిషి గత ఇరవై ఏళ్లుగా ముజఫరాబాద్ కలెక్టరు కార్యాలయం ఎదుట అవినీతి వ్యతిరేకంగా సత్యాగ్రహం చేస్తూనే ఉన్నాడట. ఇలాంటి ఆశ్చర్యకరమైన విషయాలు ఈ రికార్డుల పుస్తకంలో బోలెడు.




## ఎలైట్ వరల్డ్ రికార్డ్స్

'ఈ సృష్టిలో ఉన్న ప్రతి మనిషీ ప్రత్యేకమే. ఆ విషయాన్ని నిరూపించుకోవాల్సిన బాధ్యత మాత్రం అతనిదే' అంటుంది ఎలైట్ వరల్డ్ రికార్డ్స్. అమెరికా, ఇంగ్లండ్, నెదర్లాండ్స్, సింగపూర్, మలేషియా, ఇటలీ, న్యూజిలాండ్, జర్మనీ, ఫ్రాన్స్ దేశాల్లోని సాహస కృత్యాలనూ రికార్డు చేస్తుంది. టీవీ షోలూ, లైవ్ షోలూ, స్టేజీ ప్రదర్శనలూ నిర్వహించడం ద్వారా కొత్త కొత్త రికార్డులను నమోదు చేయడం, పాత రికార్డులను బద్దలు కొట్టేలా ప్రజల్ని ప్రోత్సహించడం ఈ సంస్థ పని. www.eliteworldrecords.org వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకుని, ఎవరైనా ప్రపంచ రికార్డుకు ప్రయత్నించవచ్చు.




## తెలుగు బుక్ ఆఫ్ రికార్డ్స్

'తెలుగు వారి ప్రతిభను ప్రపంచ వ్యాప్తం చేసే మొట్టమొదటి రికార్డుల సంస్థ'... www.telugubookofrecords.com వెబ్‌సైట్‌ను తెరవగానే కనిపించే వాక్యం ఇది. తెలుగువారి సంస్కృతీ సంప్రదాయాలను గౌరవిస్తూ, తెలుగువారి కట్టుబొట్లకూ, పండగ పబ్బాలకూ ప్రాధాన్యం ఇస్తూ, ప్రవాస, నివాస తెలుగువారికి ఒక వేదికగా నిలుస్తోందీ తెలుగు బుక్. ఈమధ్యే యామిని అనే చిన్నారి వేమన శతకంలోని వంద పద్యాల్నీ ... చివరి పాదం నుంచి మూడో పాదం, రెండో పాదం, మొదటి పాదం... ఇలా గడగడా అప్పచెప్పి సరికొత్త రికార్డును సృష్టించింది.




## ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్స్

ఆసియా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో అంతర్భాగమే అయినా, భారతీయ రికార్డులకు ప్రత్యేకస్థానం కల్పించడానికే వేరుకుంపటి పెట్టుకుంది. రకరకాల బ్రాండ్ల చిప్స్ ప్యాకెట్లను సేకరించి గ్వాలియర్ కుర్రాడు దేవమ్ రికార్డు సృష్టిస్తే... అతి తక్కువ సమయంలో షార్ట్ ఫిల్మ్ తీసి సెభాష్ అనిపించుకున్నాడు తెలుగు యువకుడు పామర్తి శివనాగారావు - ఇలాంటి రికార్డులు ఇక్కడ అనేకం.




## ఆసియా బుక్ ఆఫ్ రికార్డ్స్

ఆసియా దేశాల్లో నమోదయ్యే రికార్డులను ఇందులో చేరుస్తారు. www.asiabookofrecords.com వెబ్‌సైట్‌లో వెళ్లి, ఆన్‌లైన్ అప్లికేషన్ ఫామ్ నింపితే సరిపోతుంది. వరల్డ్ రికార్డుకు అర్హత సాధించినట్టే. గత రికార్డుల పట్టిక, వారి ప్రదర్శన వివరాలూ వెబ్‌సైట్‌లో ఉంటాయి. శ్రీనాథుడు గౌడడిండిమభట్టు కంచుఢక్కాను పగలగొట్టినట్టు... మీరూ ఆ రికార్డును బద్దలు కొడితే చాలు. ఆసియా బుక్ రికార్డుల్లోకి మీ పేరు ఎక్కిపోతుంది. ఇండొనేషియాకు చెందిన ధరేన్ కళ్లు అచ్చంగా ఎక్స్‌రే యంత్రంలా పనిచేస్తాయనీ, మనిషిని చూడగానే.. లోపల ఏ వ్యవస్థ ఎలా పనిచేస్తుందో చెప్పగలడనీ ఈ రికార్డుల పుస్తకం కథనం. 'నమ్మలేని నిజాలు' శీర్షిక కింద ఇలాంటి వింతలూ ఉంటాయి.



దైవమ్

# సిరుల తల్లి... వరాల కల్పవల్లి

**'యాదేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః'**
**జీవిత లక్ష్యం సిద్ధించాలంటే శ్రీమహాలక్ష్మి అనుగ్రహం ఉండాలి. సిరుల తల్లిగా, వరాల కల్పవల్లిగా భక్తకోటి మొక్కులందుకుంటోంది మహాలక్ష్మి. ప్రధాన శక్తి స్వరూపాలు... మహాకాళి, మహాసరస్వతి, మహాలక్ష్మి అనే ముగ్గురమ్మలలో ఒకరైన ఈ అమ్మ కరుణ కోసం అందరూ పరితపిస్తారు. లక్ష్యానికి సంబంధించిందే లక్ష్మి. తనను చేరి కొలిచేవారికి సకల సంపదలనూ అనుగ్రహిస్తుందీ అమ్మ.**

**ల**క్ష్మీదేవి ఎప్పుడు పుట్టింది, ఎవరింట పుట్టింది అన్న ప్రశ్నకు జవాబుగా... ఎన్నెన్నో సంఘటనలు కనిపిస్తున్నాయి. క్షీరసాగర మథనంలో పాల సముద్రం నుంచీ పుట్టిన సంగతి తెలిసిందే. అయితే, అంతకు ముందే చాలా సందర్భాల్లో ఆ అమ్మ ఉద్భవించింది. సృష్టికి మూలం వేదాలని చెబుతారు. ఆ వేదాలలో ప్రస్తావన కనిపిస్తోందంటేనే, మహాలక్ష్మి ఏనాటిదో అర్థం చేసుకోవచ్చు.

మహాలక్ష్మి సాక్షాత్తూ యోగశక్తి రూపం. పాండిత్యం వర్ధిల్లాలన్నా, మంచిగుణాలు అబ్బాలన్నా లక్ష్మీకటాక్షం ఉండాలి. ఆ అమ్మ అనుగ్రహం ఉంటే అణిమ, మహిమ, గరిమ, లఘిమ మొదలైన అష్టసిద్ధులు కలుగుతాయి. మహాలక్ష్మికి పద్మిని అనే పేరుంది. పద్మిని అనేది ఒక విద్య. ఆ విద్యకు లక్ష్మీదేవి అధిష్ఠాన దేవత. శ్రీమహాలక్ష్మిని పూజించి ప్రసన్నం చేసుకుంటే కుబేరుడి ధనాగారంలో ఉండే పద్మ నిధి, మహ నిధి, ముకుంద నిధి, నంద నిధి, మకర నిధి...మొదలైన నవ నిధులనూ అనుగ్రహిస్తుంది. ఆమె కటాక్షాన్ని పొందటానికి మూల మంత్రాలూ హోమాలూ ఉన్నాయి. వాటిని మహాలక్ష్మి మంత్ర సిద్ధి పొందిన సద్గురువుల నుంచి ఉపదేశంగా స్వీకరించవచ్చు.

## లక్ష్మీతత్త్వం...

ఎన్ని మంత్రాలు జపించినా, మరెన్ని హోమాలు చేసినా, ఎక్కడెక్కడి ఆలయాలో దర్శించినా లక్ష్మి తమ దగ్గర నిలకడగా ఉండటం లేదని అంటుంటారు చాలామంది. దానికి కారణం లక్ష్మీతత్త్వాన్ని అవగతం చేసుకోకపోవటమే. మహాలక్ష్మికి ఒక తత్త్వం ఉంది. శుద్ధ సత్త్వ స్వరూపిణి అయిన ఆ అమ్మ తన తత్త్వానికి తగ్గట్టుగా కొన్ని కొన్ని చోట్ల మాత్రమే స్థిరంగా ఉంటుంది. ఈ విషయాన్ని పురాణాలు, ధర్మశాస్త్రాలు వివరంగా చెప్పాయి. మహాభారత శాంతి పర్వంలో 'శ్రీసంవిధానం' అనే అధ్యాయం ఉంది. లక్ష్మీదేవి స్వయంగా తాను ఎక్కడ ఉండేదీ వివరించింది. ఇంద్రుడికి లక్ష్మీదేవి చెప్పిన ఈ రహస్యాన్ని భీష్ముడు ధర్మరాజుకు వివరించాడు. సత్యం, దానం, వ్రతం, తపస్సు, పరాక్రమం, ధర్మం అనే వాటిలో లక్ష్మీదేవి ఉంటుంది. ఒకప్పుడు బలి చక్రవర్తి సింహాసనాన్ని పొందాడు. అప్పుడా చక్రవర్తి సత్యవాదిగా, జితేంద్రియుడిగా, నిత్యం యాగాలు చేసేవాడుగా ఉండేవాడు. సింహాసనాన్ని ఎక్కిన తర్వాత అవన్నీ మానేసి చివరకు తన పేరు మీదనే అందరూ యాగాలు చేయాలని ఆదేశించాడు. అందుకే బలి చక్రవర్తిని విడిచి వెళ్లిపోతున్నట్టు లక్ష్మీదేవి చెప్పింది. ఒకసారి రుక్మిణి... లక్ష్మీదేవి ఎక్కడెక్కడ ఉండటానికి ఇష్టపడుతుందో తెలుసుకోవాలనుకుంది. ఆ సందేహాన్ని తీర్చమని నేరుగా లక్ష్మీదేవినే అడిగింది. అప్పుడు లక్ష్మీదేవి చిరునవ్వులు చిందిస్తూ ఇలా చెప్పింది... శుభాన్ని కోరేవారు, కార్యదక్షత కలిగిన వారు, తాము చేయాల్సిన పనిని ఆలస్యం లేకుండా చేసేవారు, శాంతం, దైవభక్తి, ఇంద్రియ నిగ్రహం, కృతజ్ఞత కలిగిన మనుషులున్న ఇళ్లల్లో మాత్రమే ఉంటానని స్పష్టం చేసింది. పరిశుభ్రమైన ప్రదేశాలంటే తనకిష్టమంది. స్త్రీల విషయానికొస్తే... అనవసరంగా పొరుగిళ్లకు పోయి కాలం వృథా చేసేవారు, అపరిశుభ్రంగా ఉండేవారు, తగాదాలను ఇష్టపడేవారు, అత్యాశాపరులూ తనకు నచ్చరని వివరించింది. మహాలక్ష్మి అవతరణం గురించి దేవీ భాగవతం, బ్రహ్మవైవర్త పురాణంలాంటి గ్రంథాలు వివరంగా చెబుతున్నాయి. సృష్టి ఆదిలో శ్రీకృష్ణపరబ్రహ్మ రాస మండలంలో ఉన్నప్పుడు ఆయన ఎడమభాగం నుంచి ఒక స్త్రీమూర్తి ఆవిర్భవించింది. పరబ్రహ్మ సంకల్పంతోనే ఆ మూర్తి రెండు రూపాలను పొందింది. ఒక మూర్తి మహాలక్ష్మిగా, మరోమూర్తి రాధగా అవతరించారు. రాధ శ్రీకృష్ణ పరమాత్ముని చేరింది. మహాలక్ష్మి వైకుంఠంలో చతుర్భుజాలతో ఉన్న పరబ్రహ్మ స్వరూపుడే అయిన శ్రీ మహావిష్ణువు దగ్గరకు వెళ్లింది. అక్కడ నుంచి సృష్టి అంతటా వ్యాపించింది. స్వర్గంలో స్వర్గలక్ష్మిగా, పాతాళంలో నాగలక్ష్మిగా, రాజుల దగ్గర రాజ్యలక్ష్మిగా, గృహాలలో గృహలక్ష్మిగా, గోవులలో సురభి లేదా గోవు మాలక్ష్మిగా, యజ్ఞాలలో దక్షిణాదేవిగా, చంద్రుడిలో శోభాలక్ష్మిగా, సూర్యుడిలో తేజోలక్ష్మిగా ఆ తల్లి కళకళలాడుతూ నిలుచుంది. లక్ష్మిగా భృగుమహర్షి ఇంట జన్మించింది. అందుకని భార్గవి అని అంటారు. ఆ తర్వాత మరోసారి పాల సముద్రం నుంచి జన్మించింది. అందుకే క్షీర సముద్ర రాజ తనయ అని అనటమూ కనిపిస్తుంది. ఈ పేర్లే కాక మరికొన్ని ప్రసిద్ధమైన నామాలు కూడా ఈ అమ్మకు ఉన్నాయి. పద్మ, హరిప్రియ, ఇందిర, లోకమాత, మంగళ దేవత, లోకజనని, పద్మాలయ, శ్రీ, లక్ష్మి కమల... ఈ పేర్లన్నీ మహాలక్ష్మి అవతార విశేషాలను నిరూపిస్తాయి.

## ప్రపంచవ్యాప్తంగా...

లక్ష్మీ ఆరాధన ప్రపంచవ్యాప్తంగా ఉంది. జపాన్, ఇండొనేషియా లాంటి దేశాల్లో కూడా మహాలక్ష్మి ఆలయాలు ఉన్నాయి. జైన, బౌద్ధ, తాంత్రిక సంప్రదాయాలలో కూడా లక్ష్మీ ఆరాధన కనిపిస్తుంది. శక్తి ఆరాధనతో ముడిపడిన దశ మహా విద్యలలో కమల అనే పేరున లక్ష్మీదేవి అనుగ్రహం కోసం ఒక మహావిద్య ఉంది. వైకుంఠం నుంచి భూలోకానికి వచ్చి తిరుచానూరు లేదా అలివేలు మంగాపురంలో పద్మావతిగా అవతరించినా, కొల్హాపురంలో మహాలక్ష్మిగా పూజలందుకుంటున్నా ఆ అవతరణ వెనుక మానవ జీవన మార్గదర్శకత్వానికి సంబంధించిన అనేక అంశాలు ఇమిడి ఉన్నాయి.

**- శ్రీమల్లి,** 9848543520



# మంకుపట్టు మాన్పేదెలా?

**ప్ర : మేడమ్ మా బంధువుల పాపకు అయిదేళ్లు. యూకేజీ చదువుతుంది. ట్యాబ్‌లో చూసే అరవైమూడు రెయిమ్స్ నేర్చుకుంది. తప్పుల్లేకుండా వాటిని పాడుతుంది. తనకు సంగీతమన్నా, నాట్యమన్నా ఇష్టం. స్కూలు నుంచి తిరిగొచ్చాక చాలా కథలు చెబుతుంది. తరగతిలో ఇతర పిల్లలను అనుకరిస్తుంటుంది. ఇవన్నీ బానే ఉన్నా తనకు ఇట్టే కోపమొచ్చేస్తుంది. తనకంటే పెద్దవాళ్లతో ఆడుకోవడానికి వెళ్లినపుడు తన మాటే వినాలని మంకుపట్టు పడుతుంది. వాళ్లు తనను దూరం పెడితే, ఒంటరిగా అయినా ఆడుకుంటుంది కానీ, మొండితనం వీడదు. లెగో బ్రిక్స్‌తో బిల్డింగ్‌లాంటిది కడుతున్నప్పుడు సరిగ్గా రాకపోతే తనకు విసుగొచ్చేస్తుంది. ఎప్పుడూ వేలు చీకుతూ ఉంటుంది. వాళ్ల నాన్నగారు కోప్పడితే భయంభయంగా ఓ మూలన దాక్కుంటుంది. తనను ఎలా మార్చాలి?**

**- బి. రఘురామ్, శేరిలింగంపల్లి**

**జ :** మీ సుదీర్ఘ ఉత్తరం చదివాను. పాప ప్రవర్తన పట్ల మీ ఆందోళన అర్థమైంది. అయిదేళ్ల పాప తనేం చేస్తోందో తెలిసే చేస్తుంది. అది తప్పని నచ్చజెప్పడం ద్వారా ప్రవర్తనలో మార్పు తీసుకురావచ్చు. ట్యాబ్ ద్వారా అరవైమూడు పద్యాలు తనంతటతానే నేర్చుకోవడం మంచిదే. అదే సమయంలో, తల్లిదండ్రులు రెయిమ్స్‌తో పాటు గేమ్స్‌ను ఆడమని ప్రోత్సహించాలి. ఆ వీడియో ఆటలలో కొన్ని హింసను ప్రేరేపించేవిగా ఉన్నాయేమో ఎప్పుడైనా గమనించారా? వీటి ప్రభావం కూడా మీ పాపపై తప్పక ఉంటుంది. అలాగే ఎక్కువ సమయం ఎలక్ట్రానిక్ గాడ్జెట్స్‌తో గడపడం వల్ల ఇతరులతో కలిసిపోయే నైపుణ్యాలు సన్నగిల్లుతాయి. పాప బృంద కార్యక్రమాల్లో పాల్గొనేలా చూడండి. ఇతరులతో ఎలా సమన్వయం చేసుకోవాలో నేర్పండి. చాలా విషయాల్లో మనం ఇతరులకు సహకారం అందించాల్సి వస్తుందనీ, ఇతరుల సహకారం పొందాల్సి ఉంటుందనీ ఉదాహరణలతో వివరించండి. 'తోటిపిల్లలు నీ మాట వినాలంటే కొట్టడం మార్గం కాదు.. వాళ్లకి నచ్చే విధంగా మాట్లాడాలి' అని అర్థమయ్యేలా చెప్పండి. తనతో తాను ఆడుకోవడం మంచి విషయమే. దానికి అభినందిస్తూ, ఇతరులతో ఆడుకోవడం కూడా ఎంత ముఖ్యమో తెలియజేయండి. ఇక లెగో బ్రిక్స్‌తో ఆడుకునేటప్పుడు పిల్లలు అలా ప్రవర్తించడం సహజమే. తొందరపడటం వల్ల ప్రయోజనం ఉండదని, నిదానంగా పెడితే లెగోబ్రిక్స్ పడిపోవని వివరించండి. మీరూ ఆడి చూపించండి. గద్దించడం వల్ల వేలు చీకే అలవాటు పోదు. ఒకసారి పళ్ల డాక్టర్ దగ్గరకు తీసుకెళితే, వేలు చీకడం వల్ల పళ్లకు ఎలాంటి సమస్యలు వస్తాయో చెప్పి, ఆ అలవాటు మాన్పించడానికి చిట్కాలు వివరిస్తారు. అల్లరి చేసినప్పుడు తనను తప్పుబట్టడమే కాదు, అది ఎందుకు తప్పో వివరించండి. తను ఏదైనా మంచి పని చేస్తే దానిని గుర్తించి అభినందించండి. నెమ్మదిగా తనలో మార్పు వస్తుంది.

**ప్ర : మా అమ్మాయికి మూడేళ్లు. ఎబీసీడీలు, అంకెలు బాగా చెప్తుంది. కానీ 'అమ్మా', 'నాన్నా' అని పిలవదు. ఇంకేమీ మాట్లాడదు. ఎప్పుడూ బొమ్మలతో ఆడుకుంటుంది. బయటి పిల్లలతో ఆడదు. ఏం చేయాలి?**

**- జస్వంత్, ఈమెయిల్**

**జ :** మూడేళ్ల పాప తన తల్లిదండ్రులతో ఆడుకోవడానికి ఇష్టపడట్లేదని ఎలా చెప్పగలం? పెద్దవాళ్లు తనతో తగినంత సమయం గడపాలి. కబుర్లు చెప్పాలి. కలిసి ఆడుకోవాలి. ఆ సమయంలో పెద్దలు కూడా పిల్లలైపోవాలి. అప్పుడే వాళ్లు మనతో గడపడానికి ఇష్టపడతారు. కుటుంబ వాతావరణం కూడా అందుకు దోహదం చేయాలి. తను మీతో ఆడుకోవడానికి ఇష్టపడటం లేదంటే, మీలోనే ఏదో ఇబ్బంది ఉందన్నమాట. తనకు ఇతరులతో ఆడుకోవడం సౌకర్యంగా అనిపించడం లేదన్నమాట. పసిమనసు చాలా సున్నితంగా ఉంటుంది. వాళ్లను ఎవరైనా కొట్టినా, తిట్టినా 'పెద్దవాళ్లు ఇంతే' అనే భావనకు వచ్చేస్తారు. అందువల్ల తమతో తామే ఆడుకోవడానికి ఇష్టపడతారు. మీ అమ్మాయికి కూడా అలాంటి అనుభవం ఎదురై ఉండవచ్చు. నలుగురిలో కలిసి పోవడం అనేది పిల్లలకు సహజంగానే అబ్బుతుంది. అది ఒకరు నేర్పనక్కర్లేదు. బొమ్మలతో ఆడుకోవడం ఆరోగ్యకరమైన లక్షణమే. కానీ మనుషులతో ఆడుకోవడానికి ఇష్టపడటం లేదంటే, సమస్య ఇంట్లోనే ఉంది. ఈ ప్రశ్నకు మరింత లోతుగా సమాధానం కావాలంటే మీ కుటుంబం గురించి అనేక విషయాలు తెలియాలి. కాబట్టి మంచి మానసిక నిపుణులను నేరుగా కలిసి సమస్య వివరించండి.








**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.
అడ్రస్ : ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, మెయిల్ ఐడి : sunday.aj@gmail.com

కవర్ స్టోరీ

## సరికొత్త కొలమానం...

# ఇంపాక్ట్ ఇండెక్స్!

రికార్డులు... గణాంకాలు... విజయాలు... ఆటగాడి ప్రతిభకు కొలమానాలని భావిస్తాం. క్రికెట్‌లోనూ అంతే. ఓసారి స్కోరుబోర్డు వైపు చూసి, మొత్తం మ్యాచ్‌నే విశ్లేషించే వారెందరో! క్రికెట్ పండితులు కూడా అంకెల ఆధారంగానే లెక్కలు కడతారు. అయితే, ఆ గణాంకాలను గుడ్డిగా నమ్మకుండా... ప్రత్యర్థి బలాబలాలు, పిచ్ స్వభావం, ఒత్తిడి, పరుగుల వాటా తదితర అంశాలను తూకమేసి... ప్రతిభను కొలిచే కొత్త పద్ధతే 'ఇంపాక్ట్ ఇండెక్స్'.

ఉదాహరణకు ఓ సిరీస్‌లో నాలుగు మ్యాచ్‌లు ఉంటే... ప్రతి మ్యాచ్‌లోనూ ఆటగాడి ప్రదర్శన, ఎలాంటి పరిస్థితుల్లో రాణించాడు, సిరీస్ ఫలితంపై మ్యాచ్ ప్రభావం... ఇలా అన్ని అంశాలను పరిశీలించడం నయా తక్కెడ ప్రత్యేకత. ఈ కొలమానంపై 'నంబర్స్ డూ లై' పుస్తకంలో భారత మాజీ క్రికెటర్ ఆకాశ్ చోప్రా ఆసక్తికర విశ్లేషణలు చేశారు.

అసలు, 'ఇంపాక్ట్ ఇండెక్స్' అంటే ఏమిటి?...

ఇది బుర్ర బద్దలు కొట్టుకునేంత కఠినమైన బేరీజు కాదు. ఓ జట్టు చేసిన మొత్తం పరుగుల్ని ఆధార సంఖ్య (బేస్ ఫిగర్)గా పరిగణిస్తారు. ఉదాహరణకు ఒక టీమ్ ఇన్నింగ్స్‌లో 260 పరుగులు చేసి, అందులో ఓ ఆటగాడు 40 పరుగులు సాధించాడని అనుకుందాం. అప్పుడు అతడి భాగస్వామ్యం 16 శాతం. ఇదే బేస్ ఫిగర్. దీంతోపాటు ఒత్తిడిని జయించిన తీరూ, ప్రత్యర్థి జట్టు పనితీరూ ఇక్కడ కీలకాంశాలు. బౌలర్ల విషయంలో మ్యాచ్ మొత్తం ఎకానమీని పరిశీలించి, ఒక్కో బౌలర్ ఎకానమీని విశ్లేషిస్తే ఎవరు రాణించారో తెలుస్తుంది. సిరీస్‌ను నిర్ణయించే ప్రదర్శన, కొత్త బంతి ప్రభావం, సిరీస్‌పై మ్యాచ్ ప్రభావం, ఫీల్డింగ్ ప్రతిభ, కీపింగ్ విజయ-వైఫల్యాల నిష్పత్తి... ఇవన్నీ 'ఇంపాక్ట్ ఇండెక్స్'లో కీలక భాగాలే.

సెంచరీ ఎప్పుడూ సెంచరీనే. కానీ ఉపఖండంలో చేసే సెంచరీ... పచ్చికతో కూడిన ఆసీస్, సఫారీ మైదానాల్లో సాధించే శతకానికి సమానమా? కానేకాదు. రెండింటి విలువా వేరు. కానీ అంకెల పరంగా ఆటగాడి ఖాతాలో సెంచరీ రికార్డు అవుతుంది. శతకాలు, గణాంకాలు, రికార్డులు అన్నింటినీ కాసేపు పక్కకు పెట్టి... ప్రత్యర్థి, పిచ్, పరిస్థితులు, ఒత్తిడి తదితర అంశాల ఆధారంగా విశ్లేషిస్తే ఫలితాలు వేరుగా ఉంటాయి. వాస్తవానికి దగ్గరగానూ ఉంటాయి. 'ఇంపాక్ట్ ఇండెక్స్' మైదానాన్ని ఆ వినూత్నమైన కళ్లద్దాల్లోంచే చూస్తుంది.

### 'ది వాల్'... ద్రవిడ్





పెట్టని కోట... చైనా గోడ... చెదరని ఏకాగ్రత... అన్నీ కలిస్తే ది వాల్... ద్రవిడ్. సన్నీ శకం నుంచి కోహ్లీ హయాం వరకూ... అందర్నీ తోసిరాజని 'ఇంపాక్ట్ ఇండెక్స్' ద్రవిడ్‌ను నంబర్ వన్ స్థానంలో నిలిపింది. సెంచరీలు, పరుగులు, క్రేజ్ కాదు... కఠిన పరిస్థితులు, ఒత్తిడి, జట్టును నిలబెట్టిన వైనం - ఇవే ద్రవిడ్‌ను అగ్రస్థానానికి తీసుకెళ్లాయి. కీలకమైన మూడోస్థానంలో పాతుకుపోవడం, ఆసీస్ అత్యున్నత దశలో ఉన్నప్పుడు ఆ జట్టుపై ద్విశతకం సాధించడం, ఎలాంటి పిచ్‌పైన అయినా ఆడగలగడం... ఇవన్నీ ర్యాంకింగ్‌లో 'ఇంపాక్ట్' చూపాయి. 2001 నుంచి 2006 వరకూ రాహుల్‌కు స్వర్ణయుగం. ఈ కాలంలో భారత చారిత్రక టెస్టు విజయాల్లో ద్రవిడ్ కీలక భాగస్వామి. ఇందులో విదేశీ విజయాలు ముఖ్యమైనవి. అడిలైడ్‌లో ఆస్ట్రేలియా (2003)పై చేసిన 233 పరుగులు 'వాల్' పోరాటానికి దర్పణం. ఈ విజయంతో భారత్ తన టెస్టు చరిత్రలో తొలిసారి కంగారూ గడ్డపై ఆధిక్యంలో నిలిచింది.

ఇటీవల నిర్వహించిన ట్విట్టర్ పోల్‌లో కూడా ద్రవిడ్‌కు 43 శాతం మంది ఓట్లేయగా... సన్నీకి 6 శాతం ఓట్లు మాత్రమే రావడం గమనార్హం. ఆశ్చర్యకరంగా, సెహ్వాగ్ 34 శాతంతో రెండో స్థానంలో నిలిచాడు. సచిన్‌ది (17 శాతం) మూడోస్థానం.



## దిగ్గజమే అయినా!

దిగ్గజ బ్యాట్స్‌మన్ అయినప్పటికీ టెస్టుల్లో సచిన్‌ది సహాయక పాత్రే. ఇందుకు కారణాలు అనేకం. మాస్టర్ కెరీర్ ఆరంభించిన తొలినాళ్లలో స్వదేశంలో భారత బెబ్బులి. అజహరుద్దీన్, మంజ్రేకర్, కాంబ్లి, సిద్దూ లాంటి ఆటగాళ్లు రాణించడం సచిన్‌ను సహాయక పాత్రకే పరిమితం చేశాయి. 2000 దశకంలో ద్రవిడ్, లక్ష్మణ్, గంగూలీల జోరు మొదలైంది. అందుకే 'ప్రభావ సూచిక' ఈ బ్యాటింగ్ మేధావిని టెస్టుల్లో నంబర్ వన్‌గా పరిగణించలేదు. చిత్రమేమంటే... వెన్నునొప్పితో బాధపడుతూనే 1999లో చెన్నైలో సచిన్ పాక్‌పై అద్భుత ఇన్నింగ్స్ ఆడాడు. తుదికంటా పోరాడి రెండో ఇన్నింగ్స్‌లో 136 పరుగులు చేసినా భారత్‌ను ఓటమి నుంచి రక్షించలేకపోయాడు. క్రికెట్ అభిమానులు మరచిపోలేని ఇన్నింగ్స్ అది. అయినా 'ఇంపాక్ట్ ఇండెక్స్'లో ఈ ఇన్నింగ్స్‌కు అగ్రస్థానం దక్కలేదు. రెండో అత్యుత్తమ ప్రదర్శనగా మాత్రమే నిలిచింది. సచిన్ రాణించిన సందర్భంలో జట్టులో ఇతరులూ బాగా ఆడారు. ప్రతి 2.75 ఇన్నింగ్స్‌కూ మాస్టర్ అర్ధశతకం సాధించాడు. కానీ, 200 టెస్టుల్లో ఒక్క త్రిశతకాన్నీ అందుకోలేదు. కనీసం ఓ సిరీస్‌లో 500 పరుగులు చేయలేకపోయాడు. బ్యాటింగ్‌లో నంబర్ ఫోర్... చాలా ఆకర్షణీయమైన స్థానం. సచిన్ దాదాపుగా ఈ స్థానంలోనే బ్యాటింగ్‌కు దిగాడు. నంబర్ త్రీలో ద్రవిడ్ ఉండడంతో సచిన్‌పై ఒత్తిడి లేకుండా పోయింది.




అత్యధిక టెస్టులు ఆడటం కూడా మాస్టర్ విజయ, వైఫల్యాల నిష్పత్తిపై ప్రభావం చూపింది. ఆరు సిరీస్ విజయాల్లో ఈ బ్యాటింగ్ మేధావిది కీలక పాత్ర. వన్డేల్లో మాదిరిగా ఓపెనింగ్ చేస్తే సచిన్ అత్యంత ప్రభావశీల బ్యాట్స్‌మెన్ అయ్యేవాడు.



## స్థిరత్వం... మహీ తత్వం!

టెస్టు క్రికెట్‌లో స్థిరమైన ఆటగాళ్లంటే తొలుత గుర్తొచ్చేది - ద్రవిడ్, చందర్‌పాల్, ఆటపట్టు తదితరులే. కానీ 'ఇంపాక్ట్ ఇండెక్స్'లో ఆశ్చర్యకరంగా మహేంద్రసింగ్ ధోని అత్యంత స్థిరమైన ఆటగాడయ్యాడు. అందుకు అనేక కారణాలు.

భారత జట్టుకు చిరస్మరణీయ విజయాల్ని అందించడంతో పాటు.. తిరుగులేని త్రిపాత్రాభినయమూ (కెప్టెన్, కీపర్, బ్యాట్స్‌మన్) చేశాడు. వన్డే, టి-20 ప్రపంచకప్‌లతో పాటు ఛాంపియన్స్ ట్రోఫీని కూడా జట్టు ఖాతాలో వేశాడు. ధోని నాయకత్వంలోనే తొలిసారి భారత్ టెస్టుల్లో నంబర్ వన్ అయ్యింది. తొమ్మిది సిరీస్ విజయాల్లో ధోనీ ప్రధాన భూమిక పోషించాడు. వన్డేల్లో అత్యంత ప్రభావవంతమైన ఆటగాడు.

మహీ అంతులేని శ్రమకు ఓ చిన్న లెక్కకడితే...
టెస్టుల్లో రోజుకు 540 సార్లు...
వన్డేల్లో రోజుకు 300 సార్లు
టి-20ల్లో రోజుకు 120 సార్లు
ధోని బంతిపై పూర్తి దృష్టి కేంద్రీకరించాలి. ఇలా 13 ఏళ్ళు కీపింగ్ బాధ్యతను భుజాలపై మోశాడు.

## అనిల్‌కు దక్కని అందలం

భారత బౌలింగ్‌ను పరిశీలిస్తే ఆది నుంచీ స్పిన్‌దే ఆధిపత్యం. స్వదేశీ పిచ్‌లు స్పిన్‌కు స్వర్గధామం కావడంతో సహజంగానే స్పిన్నర్లు 'తిప్పారు'. నాటి బేడీ నుంచి నవతరం అశ్విన్ వరకూ... అందర్లోకీ సొంతగడ్డపై కుంబ్లేనే అగ్రశ్రేణి స్పిన్ మాంత్రికుడు. కుంబ్లే కెరీర్‌ను జల్లెడపడితే దాదాపుగా ఒక్కో మ్యాచ్‌లో 50శాతం ఓవర్లు తనవే. తోకను తెంచడంలో ఈ కన్నడ స్పిన్నర్ తనకు తానే సాటి. లోయర్ ఆర్డర్‌ను చాప చుట్టేయడంలోనూ తొలి స్థానమే.

తొమ్మిది టెస్ట్ సిరీస్‌లలో ఈ స్పిన్ దిగ్గజం నిర్ణయాత్మక పాత్ర పోషించాడు. అన్నీ ఆల్‌రౌండ్ ప్రదర్శనలే. ఈ అంశంలో ఆస్ట్రేలియా స్పిన్ యోధుడు షేన్‌వార్న్‌తో సమంగా నిలిచాడు. 'ఇంపాక్ట్ ఇండెక్స్' మేరకు, 140 ఏళ్ల ప్రపంచ టెస్టు క్రికెట్ చరిత్రలో కుంబ్లే ఏడో ప్రభావవంతమైన బౌలర్. సొంతగడ్డ మీద అత్యంత ప్రభావం చూపినవారిలో మాత్రం కుంబ్లేకు రెండో స్థానమే దక్కింది. ఈ రెండు జాబితాల్లోనూ శ్రీలంక స్పిన్ దిగ్గజం ముత్తయ్య మురళీధరన్‌కే అగ్రస్థానం దక్కింది. ఎందుకంటే, ఆ స్పిన్ దిగ్గజానికి ఆయన జట్టులో పోటీ లేదు. అదే కుంబ్లేకు... మన జట్టులో వెంకటపతి రాజు, రాజేష్‌చౌహాన్, తర్వాతి కాలంలో హర్భజన్ పోటీదారులుగా నిలిచారు.

## నీ దూకుడు... సాటెవ్వరూ!

రవిశాస్త్రి ఓసారి... సెహ్వాగ్‌ను అడిగాడట... "టెస్టుల్లో ఓపెనర్లు ఆచితూచి ఆడతారు. మరి నీకా దూకుడెందుకు?" అని. అందుకు సెహ్వాగ్ సమాధానం... "కొత్త బంతి నా బలహీనత. దాన్ని సాధ్యమైనంత త్వరగా పాతది చేయాలన్నది నా కోరిక". వీరూ స్వభావానికి అద్దంపడుతుందీ వ్యాఖ్య. టెస్టు ఓపెనింగ్‌ను వీరూకి ముందు, వీరూ తర్వాత... రెండు శకాలుగా అభివర్ణించవచ్చు. సెహ్వాగ్ తన 23 టెస్టు సెంచరీల్లో 15 సార్లు 140 కంటే ఎక్కువ పరుగులు చేశాడు. అందులో - 200కి పైగా నాలుగుసార్లు, 300కి పైగా రెండుసార్లు. బలహీన ఫుట్‌వర్క్ ఉన్నా దాదాపు 50 సగటును సాధించడం ఈ డాషింగ్ ఓపెనర్‌కే చెల్లింది. విదేశాల్లో పది మేటి ఇన్నింగ్స్‌లు ఆడాడు. మూడు సిరీస్‌లలో నిర్ణయాత్మక పాత్ర నిర్వహించాడు. స్థిరత్వం లేకున్నా, సెంచరీలను భారీ శతకాలుగా మలచడంతో 'ఇంపాక్ట్ ఇండెక్స్' మంచి స్థానం కల్పించింది. టెస్టుల్లో సెహ్వాగ్ స్ట్రయిక్ రేట్...82. అందుకే ఆ సూచీ సెహ్వాగ్‌కు టెస్టు చరిత్రలో ఐదో అత్యుత్తమ స్ట్రయిక్‌రేట్ ఆటగాడిగా కితాబిచ్చింది.



## వెరీ వెరీ స్పెషలే కానీ...



వీవీఎస్ లక్ష్మణ్... సొగసైన స్క్వేయిర్ కట్లు, అద్భుత ఫ్లిక్‌లు, మణికట్టు మాయాజాలంతో ఆసీస్ మెడలు వంచిన ధీశాలి. టెస్టుల్లో 46 సగటు - చక్కని లెక్క. అయినా, లక్ష్మణ్‌కు రావలసినంత పేరు రాలేదు. సొంత ప్రతిభతో సిరీస్‌ను గెలిపించిన సందర్భాల్లో తను ఆడిన అన్ని ఇన్నింగ్స్‌లూ కళాత్మకాలే. 2001లో ఆస్ట్రేలియాపై 281 పరుగులు చేసిన ఇన్నింగ్స్ మరువలేనిది. కొన్ని గొప్ప ఇన్నింగ్స్‌లు ఉన్నా... పూర్తిగా టెస్టు ఆటగాడిగా ముద్రపడటం లక్ష్మణ్‌కు తగినంత పేరు రాకపోవడానికి ఓ కారణం. కొన్నిసార్లు ఆర్నెల్లవరకూ టెస్టు సిరీస్‌లు లేకపోవడంతో వీవీఎస్ విజయాలు త్వరగా మరుగునపడేవి. మొదట్లో తనకు ఏమాత్రం ఇష్టం లేకపోయినా, ఓపెనింగ్‌కు దిగాల్సి వచ్చింది. మూడు, నాలుగు స్థానాల్లో ఆడితే లక్ష్మణ్ ఖాతాలో మరిన్ని పరుగులు చేరి ఉండేవి. కానీ ద్రవిడ్, సచిన్ ఆ స్థానంలో పాతుకుపోవడంతో అవకాశం దక్కలేదు. దీంతో, మరింత కిందకు వెళ్లాల్సి వచ్చింది. 'ఇంపాక్ట్ ఇండెక్స్' బేరీజులో... అత్యంత ప్రభావశీల ఆటగాళ్లలో వీవీఎస్‌కు అసలు చోటే దక్కకపోవడం విచిత్రం.



## 'టైగర్'... టైగరే!



క్రీడలంటేనే ఒత్తిడి. ప్రతిభావంతులైన ఆటగాళ్లు కూడా ఒక్కోసారి ఒత్తిడిలో కూరుకుపోయి చేజేతులా ఓడిపోతుంటారు. ఇందుకు నాటి భారత కెప్టెన్ మన్సూర్ అలీఖాన్ పటౌడి అతీతుడు. 'టైగర్'గా పేరుగాంచిన ఈ నవాబ్ బ్యాట్స్‌మన్ 21 ఏళ్ల ప్రాయంలోనే జట్టు పగ్గాలు అందుకున్నాడు. తద్వారా భారత సారథుల్లో అతి పిన్న వయస్కుడిగా రికార్డు సృష్టించాడు.

విజయమే ఎరుగని టీమిండియాకు 'టైగర్' గెలుపు రుచి చూపించాడు. ఇతడి సారథ్యంలోనే భారత్ తొలిసారిగా విదేశాల్లో టెస్టు, సిరీస్ విజయాలను నమోదు చేసింది. 1968లో న్యూజిలాండ్‌పై ఈ ఘనత సాధించింది. ప్రమాదంలో ఓ కన్ను కోల్పోయినా, ఆరు నెలల వ్యవధిలో మళ్లీ భారత జట్టులోకి వచ్చిన పటౌడి ధీరత్వం ప్రశంసనీయం.

నవాబ్ 83 టెస్టు ఇన్నింగ్స్‌ల్లో 56 సార్లు అత్యంత ఒత్తిడిలో బరిలోకి దిగాడు. ఇందులో 23 సార్లు ఒత్తిడిని అధిగమించి చక్కని స్కోర్లు చేశాడు. కఠిన పరిస్థితుల్లో 1964లో ఆసీస్‌ను ఎదుర్కొని జట్టుకు చిరస్మరణీయ విజయాన్ని అందించాడు. పటౌడీ ప్రతిభ గురించి క్రికెట్ విశ్లేషకులు ఇంతవరకూ పెద్దగా చర్చించిందేమీ లేదు. 'ఇంపాక్ట్ ఇండెక్స్' నవాబ్ కెరీర్‌ను బేరీజు వేసి... ఒత్తిడిని ఎదుర్కోవడంలో ప్రపంచంలోనే మేటి అని మరోసారి చాటిచెప్పింది.



## ....అయినా కప్ మనదే!



**1983, 2011... ఈ సంవత్సరాల్ని భారత అభిమానులు ఎప్పుడూ మరచిపోలేరు. కారణం టీమిండియా వన్డే వరల్డ్‌కప్‌లు సాధించిన సంవత్సరాలీరెండూ! అంచనాలే లేకుండా 'అండర్ డాగ్స్'గా బరిలోకి దిగి 'కపిల్ డెవిల్స్' (1983) చరిత్ర సృష్టించింది. ఫేవరెట్‌గా మొదలెట్టి స్వదేశంలో జగజ్జేతగా నిలిచి రికార్డు లిఖించింది ధోనీసేన (2011). ముంబైలో జరిగిన ప్రపంచకప్ (2011) ఫైనల్‌ను ఓసారి గుర్తుకు తెచ్చుకుందాం. మొదట శ్రీలంక 274 పరుగులు చేసి భారత్ కు ఛాలెంజ్ విసిరింది. భారీ లక్ష్యం కాకపోయినా, స్వదేశీ అభిమానుల ఒత్తిడి మధ్య భారత్ ఛేదనకు దిగింది. 31 పరుగులకే సెహ్వాగ్, సచిన్ నిష్క్రమించారు. 1996 (లంకతో వరల్డ్‌కప్ సెమీస్) ఘటన పునరావృతం అవుతుందా అని అందరిలో సందేహం. 31/2 స్థితిలో ఉన్నా టీమిండియాకు కప్ ఖాయమని నాటి గణాంకాలు చెబుతున్నాయి. ఒత్తిడిని జయించే ఆటగాళ్లు జట్టులో ఉండడమే భారత్ ధీమాకు కారణం. 'ఇంపాక్ట్ ఇండెక్స్' ప్రకారం... ఈ అంశంలో కోహ్లీది 100 శాతం సక్సెస్ రేట్ కాగా, యువరాజ్ (85 శాతం), రైనా (77 శాతం), గంభీర్ (62 శాతం), ధోని (62 శాతం) తర్వాతి స్థానాల్లో ఉన్నారు.**





## 'సర్' ...తుస్సీ గ్రేట్‌హో!



మరొక ఆసక్తికర అంశాన్ని పరిశీలిద్దాం. దక్షిణాఫ్రికా డాషింగ్ బ్యాట్స్‌మన్ ఏబీ డివిలియర్స్ 2015లో వెస్టిండీస్‌పై సృష్టించిన పరుగుల తుపాను ఇప్పుడప్పుడే మరచిపోలేం. జొహాన్నెస్‌బర్గ్‌లో జరిగిన ఈ వన్డేలో ఏబీ కేవలం 44 బంతుల్లో 149 పరుగులతో చుక్కలు చూపించాడు. స్ట్రయిక్ రేట్ 339. ఈ మ్యాచ్‌లో వెస్టిండీస్ 291 పరుగులు చేసి ఓటమి పాలైంది. డివిలియర్స్ దూకుడు వర్ణనాతీతం. కానీ 1984లో 'సర్' రిచర్డ్స్ చేసిన 189 (170 బంతుల్లో) పరుగులు ఏబీ కన్నా అత్యుత్తమమైనవి. ఈ విండీస్ దిగ్గజ బ్యాట్స్‌మన్ స్ట్రయిక్‌రేట్ 111 మాత్రమే. ఇద్దరి మధ్యా స్ట్రయికింగ్‌లో 200కు పైగా తేడా ఉంది. అయినా జట్టు స్కోరు పరంగా వివియన్‌దే గొప్ప ఇన్నింగ్స్. ఈ మ్యాచ్‌లో దక్షిణాఫ్రికా 439 స్కోర్ చేసింది. అంటే డివిలియర్స్ వాటా 34 శాతం.. రిచర్డ్స్ భాగస్వామ్యం 69 శాతం. అంకెల్ని చూస్తే ఏబీ అందనంత ఎత్తులో ఉన్నాడు. మ్యాచ్ మొత్తాన్ని లోతుగా విశ్లేషిస్తే వివియన్ శ్రమకు ఎక్కువ విలువ. అందుకే, అంకెలు అన్నివేళలా నిజాలు చెప్పవని 'ఇంపాక్ట్ ఇండెక్స్' మొత్తుకుంటోంది.



## అన్నింట్లోనూ మేటి

విజృంభణకు పర్యాయపదం ఏబీ డివిలియర్స్. సమకాలీన క్రికెట్‌లో అన్ని ఫార్మాట్లలోనూ ఉత్తమ బ్యాట్స్‌మన్‌గా 'ఇంపాక్ట్ ఇండెక్స్' వీరతాడు వేసింది. ఫార్మాట్‌కు తగ్గట్లు శైలిని మార్చుకోవడం ఇతడి ప్రత్యేకత. వినూత్నమైన స్ట్రోక్ ప్లేతో భలేగా అలరిస్తాడు. 2012 నుంచి గణాంకాలను పరిశీలిస్తే అత్యంత ప్రభావశీలి బ్యాట్స్‌మన్ తనే. ఆరు సిరీస్ విజయాల్లో ప్రధాన పాత్ర పోషించాడు. ప్రపంచంలోని అన్ని మైదానాల్లో, ఎలాంటి బౌలింగ్‌నైనా (పేస్, స్పిన్) ఎదుర్కోగలడు. 'ఇంపాక్ట్' ప్రకారం... నూటనలభై ఏళ్ల టెస్టు క్రికెట్ చరిత్రను పరిశీలిస్తే, ప్రపంచ అత్యుత్తమ ఆటగాళ్లలో ఈ దక్షిణాఫ్రికా ఆటగాడిది ఏడో స్థానం.





## గిబ్స్ కన్నా హేన్స్ మిన్న



టి-20లు రాకముందు వన్డేలకున్న క్రేజ్ అంతా ఇంతా కాదు. వాండరర్స్ (2006)లో జరిగిన ఓ ఉత్కంఠభరిత మ్యాచ్‌ను విశ్లేషిద్దాం. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా కొదమసింహాల్లా పోరాడి పరుగుల వరద పారించాయి. తొలుత ఆసీస్ 434 పరుగుల భారీ స్కోరు చేసింది. ఆపై సఫారీలు 438 సాధించి ఔరా అనిపించారు. అంతేనా, అత్యధిక ఛేదన రికార్డు నెలకొల్పారు. ఈ మ్యాచ్‌లో గిబ్స్ 175 పరుగులు సాధించాడు. ఆశ్చర్యమేమిటంటే 1992లో పాకిస్తాన్‌పై డెస్మండ్ హేన్స్ (వెస్టిండీస్) చేసిన 96 పరుగులు గిబ్స్ ఇన్నింగ్స్ కన్నా విలువైనవి. ఇద్దరి ప్రదర్శన పోలిస్తే... మొత్తం జట్టు సాధించిన పరుగుల్లో గిబ్స్ వాటా 20% కాగా హేన్స్‌ది 33%. అందుకే గణాంకాలు గొప్ప కాదు, మ్యాచ్ సందర్భమూ పరిస్థితులూ కీలకమని వాదిస్తుంది 'ఇంపాక్ట్ ఇండెక్స్'.





## గేల్....వెనక్కి!

టి-20ల్లో బ్యాటింగ్ సునామీ క్రిస్ గేల్. ఈ ఫార్మట్‌లో పదివేల పరుగుల మార్కును దాటాడు. కానీ నిలకడలేమి అతడి బలహీనత. అయితే అతివృష్టి లేకుంటే అనావృష్టిలాంటి పరుగులు... గేల్‌ను వెనక్కినెట్టాయి. 'ఇంపాక్ట్ ఇండెక్స్' ప్రాకారం... ఈ ఫార్మాట్‌లో శామ్యూల్ బద్రీ (విండీస్) ప్రభావవంతమైన టి-20 ఆటగాడు.



## ఔరా... లారా!

బ్రియాన్ లారా... విండీస్ దిగ్గజ బ్యాట్స్‌మన్. 1994లో ఇంగ్లండ్‌తో జరిగిన టెస్టులో 375 పరుగులు చేసి సోబర్స్ రికార్డు బద్దలు కొట్టాడు. పదేళ్ల తర్వాత మళ్లీ లారానే 400 సాధించి హేడెన్‌ను అధిగమించి తన రికార్డును తిరిగి తెచ్చుకున్నాడు. వ్యక్తిగతంగా లారాకు ఇవి తిరుగులేని ఇన్నింగ్స్. కానీ నాటి మ్యాచ్‌ల ఫలితాలు, పిచ్ స్వభావం పరిశీలించి ఈ రెండు అద్భుత ఇన్నింగ్స్‌లూ అత్యంత ప్రభావవంతమైనవి కాదని తేల్చింది 'ఇంపాక్ట్ ఇండెక్స్'.



## రణధీర.. రణతుంగ!

శ్రీలంకను ద్వితీయ శ్రేణి నుంచి అగ్రజట్టుగా మలచడంలో అర్జున రణతుంగ కృషి ఎనలేనిది. నాయకత్వ లక్షణాలు, వినూత్న ఆలోచనలు లంకను టాప్‌లో నిలిపాయి. అరవింద డిసిల్వా, సమరవీర, దిల్షాన్, జయసూర్య తదితర మేటి బ్యాట్స్‌మెన్ ఉన్నా, 'ఇంపాక్ట్ బేరీజు లో.... కేవలం 36 సగటు కలిగిన రణతుంగ లంక జట్టులో కీలక బ్యాట్స్‌మన్‌గా నిలిచాడు. అతడు ఆడిన కీలక ఇన్నింగ్స్‌లే ఇందుకు కారణం.





ఎవరు గొప్ప? అనే ప్రశ్నకు నిర్దిష్టమైన కొలమానమేమీ లేదు. డాన్ బ్రాడ్‌మన్ గ్రేటెస్ట్ అంటే, సచిన్‌కేం తక్కువ అనేవాళ్లున్నారు. భీకరమైన పేస్ బౌలింగ్‌ను హెల్మెట్ లేకుండా కెరీర్ ఆసాంతం ఆడిన ధైర్యశాలి వివియన్ రిచర్డ్స్‌ది మాత్రం తక్కువ స్థానమా అని వాదించే వాళ్లూ ఉన్నారు. అందుకే కాలమాన పరిస్థితుల్ని బట్టి ఆయా సందర్భాల్లో వాళ్లు అత్యుత్తములని తెలుస్తాం. గణాంకాలు, రికార్డులతోనే ర్యాంకుల్ని నిర్ణయించలేమా? అనే సందేహం రావొచ్చు. నిజంగానే నిర్ణయించలేం. చదువుల్లో ఉద్యోగాల్లో అలా లెక్క కట్టడం వీలవుతుందేమో కానీ, ఆటల్లో కుదర్దు. ఓ చిన్న ఉదాహరణ చూద్దాం... ఓ ఆటగాడు నాలుగు ఇన్నింగ్స్‌ల్లో వరుసగా 0, 0, 0, 160 పరుగులు చేశాడు. అప్పుడు అతడి సగటు స్కోరు 40. మంచి సగటు కిందే లెక్క. కానీ నాలుగింటిలో మూడు విఫలమయ్యాడు. అది అత్యుత్తమ ప్రదర్శనగా చెప్పొచ్చా? చెప్పలేం. ఆ పరిమితిని అధిగమించడానికే, 'ఇంపాక్ట్ ఇండెక్స్' బరిలోకి దిగింది.

**- మట్టపల్లి రమేష్,** 9989378412

# మిక్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

## చూడు తమ్ముడూ...

● ఈ ప్రపంచంలో పిరికివాడు సైతం చేయగల సాహస కార్యం పెళ్లిచేసుకోవడం!



● అడగ్గానే ఇచ్చేవారి దగ్గర అప్పు తీసుకోరాదు. మనం ఇచ్చేవరకు అడగనివారి దగ్గర మాత్రమే తీసుకోవాలి.



## ఎందుకు చంపాడో తెలిసిందా?

**ఇం**టి ముందు పార్క్ చేసిన కారు పోవడంతో పోలీసు కంప్లైంట్ ఇచ్చాడు పర్వతాలు. 24 గంటల తర్వాత యథాస్థానంలో తన కారు కనిపించడంతో ఆశ్చర్యపోయాడు. పైగా అందులో ఒక ఆకాశరామన్న ఉత్తరం కూడా ఉంది.

"సార్, నన్ను క్షమించండి. నేను ఒక కారు మెకానిక్‌ని. కావాలని మీ కారు దొంగతనం చేయలేదు. మా అమ్మకు సుస్తీ చేయడంతో ఆసుపత్రికి తీసుకెళ్లడానికి సమయానికి వెహికిల్ దొరకక తప్పని సరి పరిస్థితుల్లో దొంగిలించాను.



పెట్రోలు కూడా పోయించాను. కృతజ్ఞతగా ఈ రోజు సెకండ్ షోకి మీ ఇంటిల్లిపాది వెళ్లడానికి బాహుబలి - 2 సినిమా టికెట్లు జత చేస్తున్నాను. సినిమా చూసి కట్టప్ప బాహుబలిని ఎందుకు చంపాడో తెలుసుకోండి."

దొంగ నిజాయితీకి పర్వతాలు మనసు కరిగి పోలీస్ కంప్లైంట్ వెనక్కి తీసుకున్నాడు. ఆ తర్వాత అంతా కలిసి సినిమాకు వెళ్లారు. తిరిగి వచ్చేసరికి ఇల్లు గుల్లయ్యింది. బీరువాలో ఒక చీటీ కనిపించింది. అందులో ఇలా ఉంది.

"ఇప్పుడు అర్థమయ్యిందా? కట్టప్ప బాహుబలిని ఎందుకు చంపాడో?"

## అంతే తేడా!

**"ఈ**జిప్టు మమ్మీలకు, నిజం మమ్మీలకు తేడా ఏంటి డాడీ?" అడిగింది పుత్రిక.

"ఈజిప్టు మమ్మీలకు పిల్లలు భయపడతారు. నిజం మమ్మీలకు డాడీలు భయపడతారమ్మా" చెప్పాడు జనకుడు.



## ఓడ్కా సూక్తి

**న**న్ను నమ్ముకో .. నువ్వు తప్పక డాన్స్ చేయగలవు!

## అంతా మనమంచికే!

**"రే**య్ బంగారం, నేను ఫెయిలైతే మానాన్న రిక్షావాడికిచ్చి పెళ్లి చేస్తానన్నాడురా" ఏడ్చింది ప్రియురాలు.

"వర్రీకాకు బంగారం, నేను ఫెయిలైతే మా నాన్న రిక్షా కొనిస్తానన్నాడు" ఓదార్చాడు ప్రియుడు.

## అదీ సంగతి

**"ఈ** రోజు పాఠం బుద్ధిమంతుడిలా వింటున్నావు.." మెచ్చుకుంది టీచర్.



"ఫోన్‌లో బ్యాలెన్స్ అయిపోయింది టీచర్" అబద్ధం చెప్పలేకపోయాడు రాజేష్.

చిన్నితెరపై ఒకే ఒక్క షోతో ఓవర్‌నైట్‌లో 'జబర్దస్త్' అనసూయగా క్రేజ్ సంపాదించుకుంది. ఆ తర్వాత వెండితెరపై 'సోగ్గాడే చిన్నినాయనా'లో నాగార్జున మరదలుగా తన గ్లామర్‌తో ఆకట్టుకుంది. ముచ్చటగా మూడో సినిమాకే ('విన్నర్'లో) 'సూయ సూయ సూయ సూయ సూయ... అట్టా ఎట్టా పుట్టేసావే అనసూయ' అంటూ పాట కట్టారంటే యూత్‌లో ఆమెకున్న క్రేజ్ ఏమిటో ఇట్టే అర్థమవుతుంది. 'ఆ క్రేజ్, ఇమేజ్ గుమ్మం బయటేగానీ ఇంట్లోకి అస్సలు రానివ్వన'ని అంటూ **అనసూయ భరద్వాజ్** చెప్పిన ముచ్చట్లివి...

# నాపై పాట కట్టడం గ్రేటే కదా...!

ANASUYA BHARADWAJ

**నే**ను మోడర్న్‌గా కనిపించినా, నా పేరు మాత్రం మరీ పాతగా ఉందని చాలామంది అంటుంటారు. అది మా నానమ్మ పేరు. ఆమె మీద ప్రేమతో నాన్న నాకు పెట్టారు. మా నాన్న సుదర్శన్‌రావు అప్పట్లో యూత్ కాంగ్రెస్ నాయకుడిగా పనిచేసేవారు. సుధీర్‌కుమార్ అంకుల్ (మాజీ కేంద్ర మంత్రి పి.శివశంకర్ కుమారుడు), సుధీర్‌రెడ్డి అంకుల్‌తో (ఎల్బీనగర్ మాజీ ఎమ్మెల్యే) కలిసి తిరిగేవారు. 'దర్శన్ అన్న'గా పార్టీలో అందరికీ సుపరిచితుడు. నా బాల్యమంతా హైదరాబాద్‌లోని ఓల్డ్ మలక్‌పేటలోనే గడిచింది. అక్కడి సెయింట్ ఆన్స్‌లో చదువుకున్నాను. ప్రముఖ రచయిత యండమూరి వీరేంద్రనాథ్‌గారు మా పొరుగునే ఉండేవారు. ఆయన రిఫరెన్స్ మేరకు చిన్నప్పుడే నన్ను జాన్సన్ బేబీ యాడ్ కోసం అడిగారట. కానీ మా నాన్నకు అలాంటివి ఇష్టం ఉండేది కాదు.

మా సొంతూరు నల్గొండ జిల్లాలోని భూదాన్ పోచంపల్లి. మా తాత సుందర్‌రావు భూదాన్ పోచంపల్లి సర్పంచ్‌గా ఉండేవారు. ఆ ఊళ్లోని 101 దర్వాజల ఇల్లు మాదే. వినోబాభావే పిలుపుతో మా తాత ఆస్తులన్నీ ఇచ్చేశారట. నాన్న రాజకీయ నాయకుడు కావడంతో మా ఇల్లు ఎప్పుడు చూసినా కార్యకర్తలతో సందడిగా ఉండేది. రాత్రయితే చాలు మందుపార్టీలు జరిగేవి. 'ఇంట్లో ముగ్గురు ఆడపిల్లలున్నార'ని నాన్నతో అమ్మ అప్పుడప్పుడూ వాదనకు దిగేది. ఆ ముగ్గురు ఆడపిల్లల్లో నేనే పెద్దదాన్ని. చెల్లెళ్లిద్దరూ (అంబిక, వైష్ణవి) గదిలో కూర్చుని చదువుకుంటుంటే నేను మాత్రం, ఎలాంటి బెరుకూ లేకుండా అందరి ముందూ అటూఇటూ తిరిగేదాన్ని. నన్ను ఎలాగైనా ఆర్మీ ఆఫీసర్‌ను చేయాలనే కోరిక నాన్నకు ఉండేది.

**ఎన్‌సీసీలో పరేడ్ కమాండర్ని...**

ఎన్‌సీసీలో చేరితే ఆర్మీవైపు వెళ్లేందుకు అవకాశాలుంటాయని నాన్న చెబుతుండేవారు. ఎన్‌సీసీ కోసమే నన్ను వనస్థలిపురంలోని వికాసభారతి స్కూలుకు మార్చారు. ఎన్‌సీసీలో నేను చాలా చురుగ్గా పాల్గొనేదాన్ని. ఇంటర్ చదివేప్పుడు ఎన్‌సీసీ క్యాంపులో నాకు సుశాంక్ భరద్వాజ్ పరిచయమయ్యాడు. రిపబ్లిక్ డే పరేడ్ కోసం ఢిల్లీకి వెళ్లినప్పుడు తను కూడా అక్కడికి వచ్చాడు. తొలుత నాకిష్టమైన కథల పుస్తకాలు, కామిక్ పుస్తకాలిచ్చి పరిచయం పెంచుకున్నాడు. ఒకరోజు ప్రేమిస్తున్నానని చెప్పాడు. నాకెలా స్పందించాలో తెలియలేదు. మెహిదీపట్నంలోని సెయింట్ ఆన్స్ కాలేజీలో డిగ్రీ చేస్తున్నప్పుడు కూడా ఆ స్నేహం కొనసాగింది. క్రమక్రమంగా అది ప్రేమగా మారింది. ప్రతీ విషయాన్ని ఇంట్లోవాళ్లతో పంచుకోవడం నాకు చిన్నప్పటి నుంచీ అలవాటు. భరద్వాజ్ విషయం కూడా ముందుగా అమ్మ, నానమ్మలకు చెప్పాను. ఆ తర్వాత నాన్నకు తెలిసి పెద్ద గొడవ జరిగింది. భరద్వాజ్ వాళ్లది బీహార్. దాంతో ఇంకా భయపడిపోయారు. నాకు వేరే పెళ్లి సంబంధాలు తెచ్చారు. కానీ నేను భరద్వాజ్‌ను ప్రేమిస్తున్నాననీ, వేరేవ్యక్తిని ససేమిరా చేసుకోననీ తెగేసి

చెప్పాను.

ఆ గొడవల మధ్యనే నా డిగ్రీ పూర్తయింది. భద్రుకా కాలేజీలో ఎంబీఏలో చేరాను. కాలేజీలో నేను చేసిన ప్రాజెక్ట్ వర్క్ నచ్చి 'పిక్సలాయిడ్' కంపెనీవాళ్లు జాబ్ ఆఫర్ చేశారు. 2007 నుంచి 2009దాకా అంటే రెండేళ్ల పాటు 'పిక్సలాయిడ్'లో హెచ్ఆర్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తూనే చదువుకున్నా. సినిమా పోస్ట్‌ప్రొడక్షన్ వర్క్ కోసం అక్కడికి చాలామంది దర్శకులు వచ్చేవారు. వారంతా నన్ను చూసి సినిమాల్లో నటించమని ఆఫర్లు ఇచ్చేవారు. ఆ విషయం సరదాగా భరద్వాజ్‌కు చెబితే వద్దనేవాడు. అతడికి సినిమా ఇండస్ట్రీపై సదభిప్రాయం ఉండేది కాదు. సుమారు తొమ్మిదేళ్ల ప్రేమపోరాటం చేసి, ఎట్టకేలకు మా నాన్నను ఒప్పించి 2010 జూన్‌లో పెళ్లి చేసుకున్నాం.

**టీవీ వైపు అడుగులు...**

పెళ్లయిన తర్వాత ఒక టీవీ చానల్‌లో న్యూస్‌రీడర్‌గా చేరాను. గ్లామర్ ప్రదర్శన ఏమీ ఉండదు కాబట్టి మా ఆయనతోపాటు అత్తింటివాళ్లు కూడా అభ్యంతరం చెప్పలేదు. ఆరు నెలలు తిరిగేసరికి ఆ ఉద్యోగం బోర్ కొట్టింది. ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూ, జాయ్‌ఫుల్‌గా ఉండే నా మనస్తత్వానికి సీరియస్‌గా వార్తలు చదవడం అస్సలు నాన్న, మా వారే. నేను సినిమాల్లో నటించాలంటే ముందుగా వారికి సినిమారంగంపై అభిప్రాయం మారాలి. రెండోది నాపై వారికి విశ్వాసం కలగాలి. నిజానికి ఇండస్ట్రీ మన ప్రవర్తనకు ప్రతిబింబంలా ఉంటుంది. మనం నిజాయితీగా, నిక్కచ్చిగా, ఏ తప్పూ చేయకుండా ఉంటే ఏమీ కాదు. ఈ విషయాలు మా వాళ్లకు తెలియాలనే నేను యాంకరింగ్ చేస్తున్న ఆడియో ఫంక్షన్లకు మా అత్తమామలను కూడా తీసుకెళ్లేదాన్ని. నేను ఎదుటివారితో డీల్ చేస్తున్న విధానం వారికి నచ్చింది. అలా నెమ్మదిగా మా వాళ్లకు నాపై నమ్మకం కలిగింది. యాంకరింగ్ కోసం విదేశాలకు వెళ్లాల్సి వస్తే తప్పకుండా మా వారిని వెంట తీసుకెళ్తుంటా. ఆయన నన్ను చిన్నప్పటి నుంచీ చూశారు కాబట్టి నేనేంటో బాగా





- 'బేకింగ్' ఐటెమ్స్ బ్రహ్మాండంగా చేస్తా.
- నేను ప్యూర్ వెజిటేరియన్ని. యోగా, వాకింగ్... ఇవే నా బ్యూటీ సీక్రెట్స్.
- మా అత్తగారి ఊరు బీహార్‌లోని 'బెతియా'. సెలవులకు అక్కడికి వెళ్లొస్తుంటాం.
- మా ఆయన వల్లే నాకు ఫ్యాషన్ సెన్స్ అబ్బింది.
- ఎన్‌సీసీ నాలో నాయకత్వ లక్షణాలను, ఆత్మవిశ్వాసాన్ని పెంచింది.

సూటవ్వదని డిసైడయ్యాను. అదే సమయంలో ఆడియో ఫంక్షన్లకు యాంకరింగ్ చేయమని ఆఫర్లు వచ్చాయి. ఇంకోవైపు కొన్ని టీవీషోలకు ఫ్రీలాన్సర్‌గా పనిచేయడం మొదలెట్టాను. 2011లో అబ్బాయి పుట్టాడు. వాడి పేరు శౌర్య. ఆ తర్వాత 'మా మ్యూజిక్'లో వీజేగా చేస్తుండగా 2013లో 'జబర్దస్త్' ఆఫర్ వచ్చింది. ఆ షో ఇన్‌స్టంట్‌గా హిట్టయ్యి నన్నంతా 'జబర్దస్త్ అనసూయ'గా గుర్తుపెట్టుకున్నారు. ప్రారంభంలో రోజుకు మూడు ఎపిసోడ్లు చేసేవాళ్లం. ఉదయం 7 గంటలకు సెట్లో ఉంటే మరుసటి రోజు ఉదయం 4 గంటలదాకా షూటింగ్ జరిగేది. ఆ సమయంలోనే మా రెండో అబ్బాయి అయాంచ్ పుట్టాడు. బీహార్‌లో దీపావళి తర్వాత ఆరు రోజులకు సూర్యుడిని పూజిస్తూ 'చత్' అనే వేడుక జరుపుతారు. సరిగ్గా ఆ రోజు పుట్టాడు కాబట్టి వాడికి అయాంచ్ (సూర్యుడు అని అర్థం) అని పేరు పెట్టాం.

**అచితూచి సినిమాల్లోకి...**

'రచ్చ', 'అత్తారింటికి దారేది' వంటి పెద్ద పెద్ద సినిమాల్లో ఆఫర్లు వచ్చినా అంగీకరించకపోవడానికి ప్రధాన కారణం తెలుసు. నా కోసం కొన్నిసార్లు తన కెరీర్‌ను కూడా వదులుకున్నారు. ఇప్పుడాయన ప్రైవేట్ వెల్త్ మేనేజ్‌మెంట్ 'ఆనంద్‌రాఠీ'లో వెంచర్ క్యాపిటలిస్ట్ (వీసీ)గా పనిచేస్తున్నారు.

నటుడు, దర్శకుడు అడవి శేష్ ఒక కాఫీషాప్‌లో నన్ను చూసి అక్కడే నాకొక కథ వినిపించారు. ఆ కథ నాకు బాగా నచ్చింది. అదే నా మొదటి సినిమా 'క్షణం'. ఆ సినిమా చూసిన తర్వాత 'నేను ఇబ్బంది పడని సినిమాలైతే ఓకే' అంటూ మా ఆయన గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు. ఆ స్పృహ నాక్కూడా ఉంది కాబట్టి ఏ ఆఫర్ పడితే ఆ ఆఫర్ ఒప్పుకోకుండా సెలెక్టివ్‌గా సినిమాలు చేయాలని నిర్ణయించుకున్నా. ఒక టీవీ షోలో నన్ను చూసిన దర్శకుడు కళ్యాణ్ కురసాల 'సోగ్గాడే చిన్నినాయనా'లో 'మేము వెదుకుతున్న నాగార్జున మరదలు పాత్రకు నువ్వయితేనే సూటవుతావ్' అంటూ ఆఫర్ ఇచ్చారు. ఆ సినిమాలో నాగార్జునగారి మరదలుగా కనిపించా. చిన్నప్పటి నుంచి నాగ్ సార్ సినిమాలు చూస్తూ పెరిగిన నేను ఆయనతో కలిసి నటిస్తానని కలలో కూడా ఊహించలేదు. ఇకపోతే 'విన్నర్'లో స్పెషల్‌సాంగ్ చేయడానికి కారణం 'సూయ సూయ... అనసూయ' అనే పాట నా పేరు మీదే ఉండటం. కెరీర్ ప్రారంభంలోనే నాపై పాట కట్టడం గ్రేట్‌గా ఫీలయ్యా. అందుకు గీత రచయిత రామజోగయ్యశాస్త్రిగారికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఈమధ్యనే సుకుమార్‌గారి డైరెక్షన్‌లో కూడా ఓ సినిమాకు సైన్ చేశా.

గ్లామర్ ఫీల్డ్‌లో ఉన్నాను కాబట్టి రూమర్లు సహజమే. తెరపై గ్లామరస్‌గా కనిపించే నేను ఇద్దరు పిల్లల తల్లిని అనగానే రకరకాలుగా కామెంట్లు చేశారు. అలాగే కొన్ని ఎఫైర్లు అంటగట్టారు. మొదట్లో అలాంటి వ్యాఖ్యలు చూసి బాధపడేదాన్ని. ఇప్పుడు అస్సలు పట్టించుకోవడం లేదు. నా భర్త, నా కుటుంబం, నా జీవితంపై నాకు స్పష్టమైన అవగాహన ఉంది. అంతకు మించి ఆత్మవిశ్వాసం ఉంది. సినిమాల్లో డబ్బూపేరూ రెండూ వస్తాయి. నాకంటూ ఒక డ్రీమ్‌హోమ్ నిర్మించుకుని... ఆ ఇంటి ఆవరణలో స్వయంగా పెంచుకున్న కూరగాయలతో వంట చేసుకుని... వీకెండ్స్‌లో ఫ్యామిలీతో సినిమాకో, షికారుకో వెళ్లి... హ్యాపీలైఫ్ గడపాలనేది నా కల. ప్రస్తుతం ఆ కలను సాకారం చేసుకునే దిశగా అడుగులు వేస్తున్నా.

**● చల్లా శ్రీనివాస్**

క్రైమ్ స్టోరీ

# డబుల్ మర్డర్



**ముంబయి, అంధేరీ వెస్ట్‌లోని ఒబెరాయ్ స్ప్రింగ్‌ఫీల్డ్స అపార్ట్‌మెంట్...**

**ఫ్లాట్‌లో కరణ్ కక్కడ్‌ని పట్టుకుని నిలదీస్తున్నాడు విజయ్ పలాండే- తీసుకున్న అప్పు తిరిగిచ్చేయమని.**

"సినిమా కంప్లీట్ కానీయ్ బాస్ ఇచ్చేస్తా" అని నచ్చజెప్పుకుంటున్నాడు 28 ఏళ్ల కరణ్.

"ఢిల్లీ నుంచి నేనొచ్చిందే సినిమా తీయడానికి. ఫ్రెండ్‌గా హెల్ప్ చేశావ్. నాకింకా ఫైనాన్స్ అవసరం. ఫైనాన్సర్‌తో మాట్లాడుతున్నా, ఆ ఎమౌంట్ రాగానే నీ కిచ్చేస్తా"

"నువ్వు సినిమా తీస్తున్నావా, క్రికెట్ బెట్టింగ్స్ కడుతున్నావా?"

"సిమ్రాన్ చెప్పిందా? నా విషయాల్లో తలదూరుస్తోంది... కంట్రోల్ చెయ్ బాస్"

"నువ్వెందుకు దాంతో క్లోజ్‌గా వుంటున్నావ్?"

"తనే నాతో క్లోజ్‌గా ఉంటోంది, నేను కాదు"

మాటా మాటా పెరిగింది. ఘర్షణపడ్డారు సిమ్రాన్ గురించి. కోపం పట్టలేక కత్తి తీశాడు విజయ్ పలాండే.

అదే రాత్రి ముంబాయి- పుణే ఎక్స్‌ప్రెస్ వే మీద ఒక బీఎండబ్ల్యూ కారు శరవేగంగా దూసుకుపోతోంది. ఆ కారు కరణ్ కక్కడ్‌ది. ఆ కారులోంచి ముక్కలైన అతడి దేహ భాగాలు ఒకటొకటే ఎగిరి రోడ్డవతల పడుతున్నాయి.

• • •

ముంబయి, అంధేరీ వెస్ట్‌లోని సామ్రాట్ ఆంగన్ అపార్ట్‌మెంట్...

ఫ్లాట్ ఖాళీ చేయమని గద్దిస్తున్నాడు ఢిల్లీ నుంచి వచ్చిన 67 ఏళ్ల అరుణ్ టిక్కూ.

"నీ కొడుక్కి ఐదులక్షలు డిపాజిట్ కట్టి అద్దె కూడా ఇస్తున్నాం, ఎందుకు ఖాళీ చెయ్యాలి?" అని విరుచుకుపడ్డాడు విజయ్ పలాండే.

"అయినా ఈ ఫ్లాట్ పలాండే భార్య లెవీస్ బ్రగాంజా తీసుకుంది. ఆమె జర్మనీలో వుంది" అని పలాండేకి సపోర్టుగా ఫ్రెండ్ ధనుంజయ్ షిండే వకాల్తా పుచ్చుకున్నాడు.

"ఈ ఫ్లాట్ నీ కొడుకు అనూజ్ ఇచ్చాడు, వెళ్లి ఆ వెధవని అడుగు పో...!" అని కసిరాడు పలాండే.

"మర్యాద ఇచ్చి మాట్లాడు, నా కొడుకు సినిమా యాక్టర్. వాడు బిజీగా ఉన్నాడు. మీరూ, పైన ఇంకో ఫ్లాట్‌లో వున్న వాళ్యూ... ఇద్దరూ ఖాళీ చేయాల్సిందే!" అని పట్టుబట్టాడు అరుణ్ టిక్కూ.

పలాండే కత్తి తీశాడు. ధనుంజయ్ అడ్డుపడుతున్నా ఆగకుండా అరుణ్ టిక్కూని పొడిచాడు.

'ఛత్... వీడి చేత ఈ ఫ్లాట్ రాయించుకుని చంపేద్దామనుకుంటే తొందరపడ్డావ్!' అని అరిచాడు ధనుంజయ్.

ఈ అరుపులకీ చప్పుళ్ళకీ పక్క ఫ్లాట్లలో వాళ్ళు పరుగెత్తుకొచ్చారు. రక్తంలో పడున్న అరుణ్ టిక్కూ శవాన్ని చూసి హాహాకారాలు చేశారు. పట్టుకోబోతే తప్పించుకుని పారిపోయారు పలాండే, ధనుంజయ్‌లు.

• • •

ఆ రాత్రి సిమ్రాన్‌కి కాల్ చేశాడు పలాండే. తను థాయిలాండ్ చేరుకున్నానంది సిమ్రాన్.

పలాండేకి నీరసం కమ్మింది.

విజయ్ పలాండే 1998లోనే మాఫియా డాన్ సంతోష్ శెట్టి అనుచరుడుగా చేసిన రెండు కాంట్రాక్టు హత్యలు రుజువై జైలుకెళ్లాడు. 2003లో పెరోల్ మీద విడుదలై బ్యాంకాక్ పారిపోయాడు. అక్కడ కాస్మొటిక్ సర్జరీతో రూపం మార్చుకుని 2005లో తిరిగొచ్చాడు. 2006లో అరెస్టయి 2009లో బెయిల్ మీద బయటికొచ్చి మళ్ళీ నేరకలాపాలు మొదలెట్టాడు. హోటల్ మేనేజ్‌మెంట్ కోర్సు చేసిన అతను ఒక హోటల్లో ఉద్యోగం చేస్తున్నప్పుడు మాఫియా లీడర్ సంతోష్ శెట్టితో పరిచయమై, క్రికెట్ బెట్టింగుల వైపుకు వెళ్ళిపోయాడు. సినిమాల్లో నటించాలని, ఇంట్లోంచి పారిపోయి వచ్చిన సిమ్రాన్‌ని పెళ్ళిచేసుకున్నాడు.

సిమ్రాన్‌ని ఎరగా వేసి డబ్బున్న వాళ్ళని పట్టి మోసాలు చేయడం ప్రారంభించాడు- ఒకవైపు శెట్టి అనుచరుడుగా కొనసాగుతూనే, ఇప్పుడు- తాజాగా కక్కడ్, టిక్కూలని చంపి చాలా చిక్కుల్లో పడ్డాడు.

• • •

"టిక్కూని నువ్వే చంపావని అపార్ట్‌మెంట్ వాళ్ళు పోలీసులకి చెప్పేశారు. క్రైమ్ బ్రాంచ్ వాళ్ళు నిన్ను వెతుకుతున్నారు. నిన్ను పట్టుకుంటే కరణ్ కక్కడ్ మర్డర్‌ని కూడా ఒప్పేసుకుంటావేమో!' అని నిలదీశాడు ధనుంజయ్.

"నేను థాయిలాండ్ పారిపోతాను" అని సమాధానమిచ్చాడు పలాండే.

"నీ ఫోన్‌ని ట్రాక్ చేస్తూండవచ్చు క్రైమ్‌బ్రాంచ్ వాళ్ళు" అనుమానం వ్యక్తం చేశాడు ధనుంజయ్.

పలాండే మాట్లాడలేదు. "నువ్వు చిన్నచిన్న కారణాలకే మనుషులను చంపేస్తావా? ఓపికపట్టవా? మనుషులా? చీమలా?" అని మందలించాడు ధనుంజయ్.

"నువ్వెళ్ళిపో, నాగురించి ఎవరికీ చెప్పకు. నేను గౌతం కోసం చూస్తున్నాను..." అని ధనుంజయ్‌ని పంపేశాడు పలాండే.

• • •

మర్నాడు కాల్ చేశాడు గౌతం గ్రోవర్. అతను హాట్ షాట్ స్టాక్ బ్రోకర్. సిమ్రాన్ వల్లో పడ్డాడు. సిమ్రాన్- పలాండేలు అన్నా చెల్లెళ్లుగా నటిస్తున్నారు అతడితో.

"మీ చెల్లెలు కాల్ చేసింది. నిన్ను అర్జెంటుగా థాయిలాండ్ పంపే ఏర్పాట్లు చేయమంది, నాతో రా!" అని పలాండేని తీసికెళ్ళి ఒక హోటల్ రూమ్‌లో ఉంచాడు.

"నైట్ ఫ్లయిట్‌కి రెడీగా వుండు, అన్ని ఫార్మాలిటీస్ పూర్తి చేసుకుని వస్తాను" అని వెళ్లిన గౌతమ్, ఊహించని విధంగా పోలీస్‌స్టేషన్లో వున్నాడు క్రైమ్ బ్రాంచ్ పోలీసులకి చిక్కి.

"నీ బామ్మర్దా? బామ్మర్దికి హెల్ప్ చేస్తున్నావా? సిమ్రాన్ మొగుడు వాడు, నీదగ్గర ఏమేం లాగింది సిమ్రాన్?"

"జైలో కారు లాగింది! మెర్సిడస్ కారూ లాగేసింది!"

"మర్డర్ కేసుల్లో వున్న పలాండేని నువ్వెలా థాయిలాండ్ పంపాలని ప్లానేశావ్? సిమ్రాన్‌ని ఎలా పంపేశావ్?"

"సార్, నాకేం తెలీదు! వాళ్ళు అన్నా చెల్లెళ్ళే అని నమ్మాను..." అని గుండెలు బాదుకోసాగాడు గౌతం గ్రోవర్.

• • •

హోటల్‌రూమ్‌లో గౌతం కోసం ఎదురుచూస్తున్నాడు పలాండే. నీటుగా తయారై వున్నాడు జర్నీ కోసం. కానీ రాత్రి పదకొండు దాటినా గౌతం రావడం లేదు. ఫోన్ చేస్తే పలకడం లేదు.

అప్పుడు డోర్ బెల్ మోగింది.

ఉలిక్కిపడి "ఎవరూ?" అన్నాడు. గౌతమ్ గొంతు విన్పించింది.

గబుక్కున లేచి వెళ్లి డోర్ తీశాడు. గౌతమ్ విసురుగా లోపలి కొచ్చి, పలాండేను లాగి లెంపకాయ కొట్టాడు. "మోసం చేస్తార్రా నన్నూ?" అని అరిచాడు. పలాండే బుర్ర తిరిగిపోయి "థాయిలాండ్ పంపుతున్నావా లేదా?" అని అరిచాడు ఆందోళనగా. మళ్ళీ కొట్టాడు గౌతమ్. ఆ దెబ్బలు తింటూనే పలాండే ఇటు చూస్తే - డోర్ దగ్గర నిలబడి చూస్తున్నారు క్రైమ్ బ్రాంచ్ పోలీసులు.

**● సికిందర్**




**దెబ్బ మీద ఇంకో దెబ్బ తగిలితే ఓర్చుకోవచ్చు. ఏకంగా పదిహేడు దెబ్బలు తగిలాయి. ప్రతి వ్యాపారంలోనూ నష్టమే. ప్రయత్నించగా, ప్రయత్నించగా... ముగ్గురూ తలో వేయి రూపాయలు సమకూర్చుకోగలిగారు. ఆ మూడు వేలతో ముగ్గురు యువకులు చేసిన ప్రయోగమే కోట్ల రూపాయల వ్యాపారంగా మారింది.. 'షేర్‌చాట్' యాప్ సృష్టికర్తల సక్సెస్ స్టోరీ ఇది.**

# షేర్‌చాట్... త్రీ ఇడియట్స్!

**కా**న్పూర్ ఐఐటీ విద్యార్థులు... ఫరీద్ అహ్సాన్, అంకుశ్ సచ్‌దేవ, భానుసింగ్ జిగిరీ దోస్తులు. చదువు పూర్తయిపోగానే, ఎవరి దగ్గరో ఉద్యోగం చేయడం కంటే, చేతిలోని సాఫ్ట్‌వేర్ టెక్నాలజీతో కొత్తగా ఏదైనా ప్రయత్నిద్దామని అనుకున్నారు. ఆలోచన రావడమే ఆలస్యం... రియల్ ఎస్టేట్, క్రైమ్ ఎనాలిసిస్, డిబేట్స్ తదితర విషయాల మీద పదిహేడు రకాల యాప్స్ తయారు చేశారు. మార్కెట్లో దేనికీ పెద్దగా స్పందన రాలేదు. దీంతో జనం ఆ ముగ్గురు మిత్రుల్నీ ముద్దుగా 'త్రీ ఇడియట్స్' అని పిలవడం మొదలుపెట్టారు.

'చిమ్మ చీకట్లో నడుస్తుంటాం. చాలా దూరమే వచ్చేస్తాం. ఆ దశలో వెనక్కి రాలేని పరిస్థితి. ఏ దారీ కనిపించదు. అప్పుడు, అచ్చంగా అలాంటి పరిస్థితిలోనే ఉన్నాం. ఒకటి మాత్రం నిజం. ఎన్ని వైఫల్యాలు వచ్చినా మేం నమ్మకాన్ని కోల్పోలేదు. మనమీద మనకు విశ్వాసం లేకపోవడమే అసలు సిసలు వైఫల్యం. డిబేట్స్‌కు సంబంధించిన 'ఒపీనియో' అనే యాప్‌ను తయారుచేసే పనిలో ఉండగానే... మేం ముగ్గురం కలసి దాదాపు 600 వాట్సాప్ గ్రూపులను క్రియేట్ చేశాం. మిగతా వాట్సాప్ గ్రూపుల్లోనూ మమ్మల్ని చేర్చుకోమని అందర్నీ కోరేవాళ్లం. దీని వల్ల ... ఆ షేర్లూ, పోస్టుల ద్వారా జనం ఆలోచనలు తెలుసుకున్నాం" అంటాడు షేర్‌చాట్ వ్యవస్థాపకుల్లో ఒకడైన ఫరీద్ అహ్సాన్. స్మార్ట్ ఫోన్ల వినియోగం బాగా పెరిగింది. కానీ అందులో చాలామందికి మాతృభాష తప్ప మరొకటి రాదు. దీంతో ఇంగ్లిష్‌లో సమాచారం ఇచ్చే యాప్స్ పెద్దగా విజయవంతం కాలేకపోతున్నాయి. ప్రాంతీయ భాషలోనే సమాచారం అందించగలిగితే... అందరికీ చేరువకావచ్చనే విషయం వాట్సాప్ గ్రూపుల్లో చేరాకే ఆ ముగ్గురికీ అర్థమైంది. ఆ ఆలోచలోంచి పుట్టిందే 'షేర్ చాట్'. తెలుగు, తమిళం, మలయాళం, గుజరాతీ వంటి ఎనిమిది ప్రాంతీయ భాషల్లో ఈ యాప్‌ను వినియోగించుకోవచ్చు. అంతే కాకుండా నచ్చిన సమాచారాన్ని వాట్సాప్‌లో షేర్ చేసుకోవచ్చు, ఫేస్‌బుక్ మాదిరిగా ఇతరులు పోస్టు చేసిన వీడియోలు, ఫోటోలు చూడవచ్చు, లైక్ కొట్టవచ్చు. ఇన్‌స్టాగ్రామ్ తరహాలో నచ్చిన వ్యక్తులను ఫాలో అవ్వవచ్చు. వాట్సాప్, ఫేస్‌బుక్, ఇన్‌స్ట్రాగ్రామ్... ఈ మూడింటి ప్రయోజనాలు ఒకేదాంట్లో ఉండడం వల్ల 'షేర్‌చాట్' త్వరగానే విజయవంతం అయ్యింది. ఇప్పటికే దాదాపు 80 లక్షల మంది నెటిజన్లు 'షేర్‌చాట్' యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకున్నారు. ఈ యాప్‌లో నుంచి ఫొటోగాని, వీడియోగాని షేర్ చేసినప్పుడు, వాటితో షేర్‌చాట్ డౌన్‌లోడ్ లింకు కూడా ఆటోమెటిక్‌గా వెళ్లేలా సాఫ్ట్‌వేర్‌ను రూపొందించారు. ఈ ఐడియా కూడా డౌన్‌లోడ్స్ త్వరగా పెరిగేందుకు బాగా ఉపయోగపడింది.



ఫరీద్ అహ్సాన్, అంకుశ్ సచ్‌దేవ, భానుసింగ్

## అలా మొదలైంది....

'ముంబయికి వచ్చిన కొత్తలో మాకంటూ ఓ గది కూడా ఉండేది కాదు. క్యాంపస్‌లో ఉన్నప్పుడు ఇంటర్న్‌షిప్‌లూ స్కాలర్‌షిప్‌ల ద్వారా సంపాదించుకున్న డబ్బు ఓ రెండు లక్షల దాకా పోగైంది. ఆ మొత్తంతోనే చాలా రోజులు బండి నడిచింది. ఆ డబ్బుతోనే రకరకాల యాప్స్‌తో అనేకానేక ప్రయోగాలు చేశాం. చివరికొచ్చేసరికి మూడంటే మూడు వేల రూపాయలే మిగిలాయి. అవీ కరిగిపోతే... రోడ్డున పడాల్సిందే! చాలా జాగ్రత్తగా ఖర్చు చేయాలని తీర్మానించుకున్నాం.

పగలంతా ఉద్యోగాలు చేసుకుంటూ రాత్రిళ్లు ఓ మిత్రుడి ఆఫీసులో తలదాచుకునేవాళ్లం. ఒకపూట భోజనంతో సరిపెట్టుకోవాలనీ సబ్బూ షాంపూ వగైరా చిల్లర ఖర్చుల్ని నియంత్రించుకోడానికి స్నానం మానేయాలనీ లెక్క లేసుకున్నాం. అదృష్టవశాత్తూ, ఆ అవసరం రాలేదు' అంటాడు సచ్‌దేవ. షేర్‌చాట్ ఐడియా క్లిక్ కావడంతో వెంచర్ క్యాపిటల్ సంస్థలు సూట్ కేసులతో వరుసలు కట్టాయి. తెల్లారేదాకా ఎక్కడ తలదాచుకోవాలో తెలియనివాళ్లు కాస్తా, రాత్రికి రాత్రే కోటీశ్వరులుగా మారారు. 'టూ బై త్రీ' చాయ్ జీవితం తెలుసు కాబట్టి, ఆ కుర్రాళ్లు వ్యాపార నిర్వహణలో ఎలాంటి ఆర్భాటాలూ చేయడం లేదు. పెద్దపెద్ద జీతాలిచ్చి చేయితిరిగిన నిపుణుల్నీ తీసుకోవడం లేదు. ఉన్న ముప్పైన లభైమందీ తాజాగా పట్టాపుచ్చుకుని వచ్చిన బాపతే. ఆఫీసు వాతావరణం కూడా క్యాంపస్‌ను తలపించేలా ఉంటుంది. నో బాసిజం, నో క్యాబిన్ కల్చర్! వ్యవస్థాపకుల నుంచి అటెండర్ దాకా ఒకర్ని ఒకరు పేరుపెట్టి పిలుచుకుంటారు.

బృందంతో...



# కూల్ ఫ్యాషన్స్



## గుండ్రంగా అందంగా

చురుక్కుమనే ఎండ నుంచి కళ్లను రక్షించే సన్‌గ్లాసెస్‌కి ఈ సీజన్‌లో చాలా డిమాండ్ ఉంటుంది. మీ కలెక్షన్‌లో రెట్రోస్టైల్ రౌండ్ సన్‌గ్లాసెస్‌కి చోటివ్వమని అంటోంది నేటి ఫ్యాషన్ ప్రపంచం. 'ఫ్యాషన్ ఈజ్ రిపీటింగ్ ఇట్‌సెల్ఫ్' అనే నానుడిని నిజం చేస్తూ రౌండ్ సన్‌గ్లాసెస్‌కి మళ్లీ క్రేజ్ వచ్చేసింది.

ఆడవాళ్లకు, మగవాళ్లకు కూడా చక్కగా నప్పే ఈ కళ్లజోళ్లను బాలీవుడ్ హీరోయిన్లూ ధరిస్తున్నారు. 'రౌండ్ సన్‌గ్లాసెస్ ధరించేవాళ్లు ఎక్కువ మేకప్ వేసుకోనక్కర్లేదు. తేలికపాటి మేకప్, లిప్‌స్టిక్ వేసుకుని జుట్టు వదిలేస్తే బాగుంటుంది' అంటున్నారు ఫ్యాషన్ నిపుణులు.



## కేశాలే నగలు

లేటెస్ట్ బ్యూటీ ట్రెండ్ - బిజ్యుయెల్డ్ అండర్‌కట్. మెడ వెనుక వైపున జుత్తును ట్రిమ్ చేసి, చూడచక్కని కళాకృతులను సృష్టించడమే ఈ ట్రెండ్. ముందు జుత్తంతా పైకి దువ్వి, మెడపైన జుత్తును దాదాపుగా తొలగించి ఆ ప్రాంతంలో జెల్ రాసి, కావాల్సిన ఆకృతులను బ్లేడుతో నేర్పుగా చెక్కి, ఆపైన జుత్తుకు, డిజైన్‌కు తగిన కలర్స్‌తో డై చేసేస్తారు.



## జీన్సే కాన్వాస్

సాధారణ జీన్స్ షర్ట్‌ని కాన్వాస్‌గా చేసుకుని రంగురంగుల చిత్రాలను సృష్టిస్తే అదే బోహో చిక్ డెనిమ్ జాకెట్. జీన్స్‌లోని 'జెండర్ ఈక్వాలిటీ'కి చెక్ పెడుతూ బొహిమియన్-నేపాలీ హస్తకళల మేళవింపుతో వినూత్న ఆకృతులను సృజించి, వాటికి పూసలూ, రాళ్లూ పొదిగి 'లేడీస్ స్పెషల్'గా అందిస్తున్నారు. పశ్చిమదేశాల్లో బాగా పాపులరైన ఈ ట్రెండ్ ఇప్పుడిప్పుడే ఇండియాలోనూ ఆదరణ పొందుతోంది.

## మట్టికొట్టుకుపోతే... అదిరే ఫ్యాషన్!

ఇది కూడా ఫ్యాషనేనా? అని ఆశ్చర్యపోకండి. 'పుర్రెకో బుద్ధి' అన్నట్టు ఒక అమెరికన్ కంపెనీ ఇదిగో ఇలా మట్టిగొట్టుకుపోయిన (నిజంగా కాదు లెండి. అలా డిజైన్ చేశారు) జీన్స్‌ని తయారు చేసింది. జీన్స్ ప్యాంట్లే కాదు, మ్యాచింగ్‌గా బురదలో ముంచి తీసినట్టున్న షర్టులూ అమ్మకానికి ఉన్నాయి. ఒక్కొక్కటి 425 అమెరికన్ డాలర్లు మాత్రమే.





## వెండి జుత్తు... నల్ల గడ్డం!

అతికించినట్టున్న మీసకట్టు, నున్నటి గడ్డం... ఒకప్పటి సంగతులు. ఇప్పుడు చాలామందికి గడ్డం శరీరంలో భాగమైపోయింది. అది ప్రత్యేకంగా కనిపించడానికి తలపై జుత్తుని రకరకాలుగా మార్చేస్తున్నారు. ఈ ఏడాది ట్రెండ్ ఏమిటో తెలుసా... జుత్తుకు వెండితీగల్లాంటి రంగు వేసి, గడ్డాన్ని మాత్రం సహజంగా వదిలేయడం. అంటే 'బ్లాండ్ హెయిర్ అండ్ బ్లాక్ బియర్డ్' ట్రెండ్ అన్నమాట. ప్రఖ్యాత ఫుట్‌బాల్ ఆటగాడు మెస్సీ ఈ ట్రెండ్‌కు మరింత ఆకర్షణ తెచ్చాడు.





## నాజూకు నడుము పట్టీలు

అన్నింట్లోనూ ఫ్యాషన్ కొత్త పుంతలు తొక్కుతుంటే... నేను మాత్రం ఎందుకు ఊరుకోవాలి? - అనుకుందేమో నడుము పట్టీ నిజంగానే కొత్త అవతారంలో కట్టి పడేస్తోంది. అమ్మాయిల నాజూకు నడుముకు మరింత అందాన్నిస్తూ, ఒకేసారి రెండు బెల్టులు పెట్టుకోవడం కొత్త ట్రెండ్. లెదర్, ఫ్యాబ్రిక్, మెటల్ మెటీరియల్‌తో వస్తున్నాయీ కొత్త బెల్టులు. మొబైల్ పౌచ్, కీ చైన్స్ బెల్ట్‌తో పాటు వస్తున్నాయి. కొన్ని బెల్టులు ఛాతీ కింద నుంచి పొత్తికడుపు వరకూ ఉంటున్నాయి. వీటిని 'వెయిస్ట్ టై లేడీస్ వైడ్ బెల్ట్స్' అని పిలుస్తున్నారు.



## కొమలాంగి... కుంచె విన్యాసం!

ఫ్యాషన్ ప్రపంచంలో నయా సంచలనం బ్రష్ స్ట్రోక్ కలర్ ప్రింట్ డ్రెసెస్. పెయింట్ బ్రష్‌ని రంగుల్లో ముంచి దుస్తులపై చిలకరిస్తే ఎలా ఉంటుందో, ఈ డిజైన్లూ అలానే ఉంటాయి. ఆ బ్రష్‌స్ట్రోక్స్ కూడా చిన్నపిల్లలకు పెయింట్ బ్రష్ ఇచ్చి వదిలేస్తే ఎలాంటి డిజైన్లు వేస్తారో అలానే ఉంటున్నాయి. బ్రష్ స్ట్రోక్ కలర్ ప్రింట్ జాకెట్స్ ప్రత్యేకతంగా కనిపించడానికి అదే కారణం.



## పర్సనల్ ట్రావెల్ అసిస్టెంట్

మొదటిసారి విదేశాలకు వెళ్లేవారికి లగేజ్ బరువుతో సమస్య. తరచూ ప్రయాణాలు చేసే వారికి ఫోన్ ఛార్జింగ్‌తో సమస్య. మరికొంతమందికి సామాను ఎక్కడో తప్పిపోయిందన్న బాధ. విమాన సంస్థ సిబ్బంది దాన్ని వెతికి పట్టుకుని ఇంటికి పంపించేవరకూ ఒకటే దిగులు. ఈ సమస్యలన్నింటికీ చెక్ పెడుతూ మార్కెట్లోకి వచ్చింది 'బ్లూ స్మార్ట్ సూట్‌కేస్'. మూడుపొరల పాలీ-కార్బనేట్‌తో తయారైన ఈ సూట్‌కేసుపై గీతలు పడవు. నీటిలో తడిసినా పాడవదు. బ్లూటూత్ సాయంతో మన స్మార్ట్‌ఫోన్‌కి కనెక్ట్ చేసుకోవచ్చు. హ్యాండిల్ పట్టుకుని లిఫ్ట్ చేయగానే లగేజీ బరువెంతో ఫోనుతెరపై కనిపిస్తుంది. ఇక ఈ సూట్‌కేసులో 10000 mah సామర్థ్యం గల పవర్‌బ్యాంక్ ఉంది. దీనితో స్మార్ట్‌ఫోన్, ల్యాప్‌టాప్‌లకు ఛార్జింగ్ పెట్టుకోవచ్చు. ల్యాప్‌టాప్ కోసం సూట్‌కేసు పైభాగంలో ఒక అర ఉంటుంది. దాన్లో యుఎస్‌బి పోర్ట్ ఉంటుంది. మరో యుఎస్‌బి పోర్ట్‌ను పెట్టె వెలుపల ఇచ్చారు. ఛార్జింగ్ పెట్టిన మొబైల్‌కి కాల్ వస్తే తేలిగ్గా తీసుకోవడానికి ఈ ఏర్పాటు. విమానాశ్రయ లాబీల్లో తిరగాలనుకున్నప్పుడు దీన్ని పట్టుకుని తిరగక్కర్లేదు. ఎక్కడో ఒక చోట పెట్టి హాయిగా మన పని మనం చూసుకోవచ్చు. ఈ సూట్‌కేసులో ప్రాక్సిమిటీ సెన్సర్ ఉండటం వల్ల దొంగలు ఎత్తుకుపోవడానికి ప్రయత్నిస్తే సూట్‌కేసు ఆ విషయాన్ని మన ఫోన్‌కు చేరవేస్తుంది. ఒకవేళ పట్టుకుని పారిపోయినా ఫోన్‌తో అనుసంధానం ఉండటం వల్ల ఎక్కడుందో తేలిగ్గా కనుక్కోవచ్చు. ఫోన్ సాయంతోనే పెట్టెకు డిజిటల్ లాక్ వేయవచ్చు, తీయవచ్చు. ఈ సూట్‌కేసులో జీపీఎస్ సిస్టమ్ ఉన్న కారణంగా మీ ట్రిప్ డేటాను నోట్ చేస్తుంది. ప్రయాణం మధ్యలో ఎంతదూరం వచ్చామో చెప్తుంది. ఇన్ని ప్రత్యేకతలున్న బ్లూ స్మార్ట్ సూట్‌కేస్‌ను 'పర్సనల్ ట్రావెల్ అసిస్టెంట్' అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.




## రోబో షెఫ్



మొన్నమొన్నటి వరకూ హోటల్స్‌లో వెయిటర్స్ బదులు రోబోలు సర్వ్ చేస్తున్నాయని చదివాం. ఇప్పుడు చేయి తిరిగిన పాకశాస్త్ర ప్రవీణులను తోసిరాజని 'యంత్ర భీముడు' ఆ పని చేయడానికి ఎలా ఉపక్రమిస్తున్నాడో చూద్దాం.

ఏమిటీ వంటకు ఉపయోగించాల్సిన దినుసుల్ని కావాల్సిన మోతాదులో వేసేస్తే వంట అయిపోతుందా? ఓపిగ్గా పొయ్యి దగ్గరే నుంచుని పోపు మాడిపోకుండా మంటను తగ్గిస్తూ, పెంచుతూ వంట చేయాలి కదా! రోబో వల్ల ఏమవుతుంది అనుకుంటున్నారేమో? ఒక ప్రొఫెషనల్ షెఫ్ ఎంత బాగా వంట చేయగలడో అంత చక్కగా వంట చేస్తుందీ రోబో. అయితే ఈ రోబోకు రెండు చేతులు మాత్రమే ఉంటాయి. వాటితోనే రెండువేల వంటలు చేసి పారేయగలదు. నిజంగా వంటవాడు చేసినట్టుగానే లాఘవంగా చేతులు కదపడానికి ఈ రోబో చేతుల్లో 129 సెన్సర్లు ఏర్పాటు చేశారు. 24 విడిభాగాలను కలిపితే ఈ చేతులు తయారయ్యాయి. చేతులు కదపడానికి 20 మోటార్లను బిగించారు. అవసరమైన వంట సామాను అందుబాటులో ఉంచి, ఆఫీసు నుంచి వచ్చేటపుడు చరవాణిలో ఉన్న వంటల జాబితాలోంచి ఒక వంటను ఎంచుకున్నారనుకోండి. మీరు ఇంటికి చేరేటప్పటికి ఎంచుకున్న వంట... ఘుమఘుమలాడుతూ బల్లమీద ఉంటుంది. ఏడాది చివరికల్లా ఈ రోబోను అందుబాటులోకి తీసుకురావాలని అనుకుంటోంది చైనా!

## గోడ కాదు తెర

పోటీ ప్రపంచంలో కొత్త వ్యాపారాన్ని ప్రారంభించడం అనుకున్నంత సులువు కాదు. వినియోగదారులను ఆకట్టుకోవాలంటే ఏదో ప్రత్యేకత చూపించి తీరాలి... - ఇలాగే ఆలోచించింది శాన్‌ఫ్రాన్సిస్కో కంపెనీ సేల్స్‌ఫోర్స్. అందుకే తమ లాబీలోని 107 అడుగుల గోడను 'ఎల్‌ఈడీ వాల్'గా మార్చేయాలనుకుంది. క్లయింట్ కోరిన తక్షణం ఆ డిజిటల్ వాల్‌ను అందంగా డిజైన్ చేసింది 'అబ్స్యూరా డిజిటల్' కంపెనీ. ఒకసారి జలపాతం ఆశ్చర్యచకితుల్ని చేస్తే, మరోసారి దట్టమైన అడవి కనువిందు చేస్తుంది. ఇలా మనోహర ప్రకృతి దృశ్యాలు 'ఎల్‌ఈడీ వాల్' పై కనిపిస్తూ చూపరులను అప్రతిభుల్ని చేస్తున్నాయి. ఇలా ఒక్క ఆలోచనతో ప్రపంచం మొత్తాన్ని మాట్లాడుకునేలా చేసి 'సేల్స్‌ఫోర్స్' ఉచిత ప్రచారాన్ని పొందింది.





డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'గౌట్' వ్యాధి నివారణ సులభం

మానవ శరీరంలోని ఏ కదలికలోనైనా కీళ్ళు అత్యంత ప్రధానమైన పాత్ర పోషిస్తుంటాయి. ఇంతటి ప్రాధాన్యం సంతరించుకున్న కీళ్ళలో ఎటువంటి చిన్న సమస్య ఏర్పడినా అది ఆయా కదలికలను కష్టతరంగా మార్చడమే కాకుండా రోజువారీ దినచర్యల నిర్వహణలో సైతం తీవ్ర ఇబ్బందులను కలుగజేస్తుంది. అలాంటి వాటిలో గౌట్ వ్యాధి కూడా ఒకటి. ఇది ముఖ్యంగా కాలి బొటనవ్రేలు ప్రాంతంలో ఎక్కువగా ఏర్పడుతుంది. దీని వలన ఏర్పడే తీవ్రమైన నొప్పి, సలపరం, మంటతో పాటుగా వాపు తలెత్తటం వలన ఆ కీళ్ళకు సంబంధించిన ఏ కదలికైనా భరించలేనంత నొప్పితో కూడుకుని ఉంటుంది. ఈ వ్యాధి తరచూ ఏర్పడేదిగా ఉండటమే కాకుండా, దీనికి సరైన చికిత్సను అందించకుండా నిర్లక్ష్యం వహించినట్లయితే ఇది కీళ్ళను పూర్తిగా దెబ్బ తీసే ప్రమాదం ఉంటుంది.




**'గౌట్' లేదా 'గౌటీ ఆర్థ్రైటిస్' అనగా:-** సాధారణంగా మన రక్తంలో 'యూరిక్ ఆమ్లం' అనే రసాయనం ఉంటుంది. ఇది ఉండవలసిన మోతాదు కంటే ఎక్కువగా ఉన్నప్పుడు, స్ఫటికాల రూపంలో కీళ్ళలోకి వచ్చి చేరుతుంది. ఈ విధంగా యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు కీళ్ళలో ఎక్కువగా పేరుకుపోయినప్పుడు కీళ్ళ సంబంధిత కదలికలన్నీ కష్టతరంగా మారుతాయి. దీనినే మనం 'గౌట్' లేదా 'గౌటీ ఆర్థ్రైటిస్' అని అంటాము.

**కారణాలు:** ఈ వ్యాధి ముఖ్యంగా ప్యూరిన్స్ ఎక్కువగా ఉండే ఆహారం - లివర్, మాంసము, పుట్టగొడుగులు, స్వీట్ బ్రెడ్ మరియు మద్యం వంటివి అధికంగా తీసుకున్నప్పుడు యూరిక్ ఆమ్లం స్థాయిలు పెరగటంతో, అలాంటి పరిస్థితి గౌట్ వ్యాధికి దారితీస్తుంది. • అధిక బరువు, మధుమేహం, అధిక రక్తపోటు మరియు కొలెస్ట్రాల్ అధికంగా ఉండటం వంటివి ఈ వ్యాధి రావడానికి కారణాలు కావచ్చు.

**లక్షణాలు:** తీవ్రతను బట్టి గౌట్ లక్షణాలు చాలా ప్రస్ఫుటంగానే కనిపిస్తాయి. ఈ సమస్య ఎక్కువగా కాలి బొటన వ్రేలులో కనిపిస్తుంది. ఉదయాన్నే నిద్ర లేచినప్పుడు గానీ లేదా అర్థరాత్రి సమయంలో గానీ బొటన వ్రేలులో విపరీతమైన నొప్పి, సలపరం, మంటగా ఉండటంతో పాటు వాపు కనిపిస్తుంది, మరియు ఆ ప్రాంతమంతా ఎర్రగా కందిపోయి ఉంటుంది. ఇలాంటివన్నీ గౌట్ వ్యాధిలో కనిపించే ప్రధాన లక్షణాలు.
• మొదట్లో ఈ వ్యాధి ఒకటి లేదా రెండు కీళ్ళకు మాత్రమే పరిమితమైనప్పటికీ - దీన్ని నిర్లక్ష్యం చేస్తే ఇది దీర్ఘకాలికంగా మారి ఇతర కీళ్ళకు కూడా వ్యాపించి, వాటిని కూడా తీవ్రంగా దెబ్బ తీసేందుకు అవకాశముంటుంది. కాబట్టి తగిన జాగ్రత్తలతో పాటు సరైన చికిత్స తీసుకోవడం ద్వారా ఈ సమస్య నుండి కీళ్ళను కాపాడుకోవచ్చు.

**రోగ నిర్ధారణ పరీక్షలు:** రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉన్నంత మాత్రాన గౌట్ ఉన్నట్లుగా నిర్ధారించరాదు. యూరిక్ ఆమ్లం రక్తంలో అధికంగా ఉండటంతో పాటు, కీళ్ళలో ఆర్థ్రైటిస్ లక్షణాలు కూడా ఉన్నట్లయితే దానిని తప్పనిసరిగా 'గౌట్'గా నిర్ధారించుకోవాలి. అలాగే మరికొన్ని ఇతరత్రా సందర్భాలలో కూడా రక్తంలో యూరిక్ ఆమ్లపు శాతం ఎక్కువగా ఉండవచ్చు. ఉదాహరణకు సోరియాటిక్ ఆర్థ్రైటిస్, కిడ్నీ ఫెయిల్యూర్, లుకేమియా వంటి సమస్యలు తలెత్తినప్పుడు కూడా రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉంటుంది. • రక్తపరీక్ష (రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉండటం, ఈఎస్ఆర్ స్థాయిలు పెరగడం), ఎక్స్‌రే (మృదు కణజాలంలో వాపు కనిపిస్తుంది)
• కీళ్ళలోని ద్రవం తీసి పరీక్షించడం మొదలైన పరీక్షల ద్వారా వ్యాధి నిర్ధారణ చేయబడుతుంది. **ఆహార నియమాలు:** గౌట్ వ్యాధి బాధితులు మాంసకృత్తులు తినటం బాగా తగ్గించాలి. ముఖ్యంగా హైప్యూరిన్ డైట్ తీసుకోకూడదు. **మాంసకృత్తులు (ప్రోటీన్లు) 2 రకాలు. అవి (1) ప్యూరిన్స్, (2) పిరమిడైన్స్.** గౌట్ బాధితులు ప్యూరిన్స్ రకం ప్రోటీన్లు ఎక్కువగా తీసుకోరాదు. **మాంసాహారాలు:** మేక, గొర్రె, బీఫ్ వంటివి తినరాదు. **జంతు అవయవాలు:** లివర్, కిడ్నీ, ఎముకల మూలుగు, పేగులు మొ॥వి తినరాదు. **శాకాహారాలు:** పాలకూర, క్యాబేజీ, క్యాలీఫ్లవర్, చిక్కుళ్ళు, వివిధ రకాల బీన్స్, పుట్ట గొడుగులు మొ॥వి తగ్గించాలి. ఆల్కహాల్ తదితరాలకు దూరంగా ఉండాలి.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్య విధానంలో ఈ గౌట్ వ్యాధి నివారణ నిమిత్తం ఉత్తమ చికిత్స అందుబాటులో ఉంది. ఈ చికిత్సా ప్రక్రియ ద్వారా రోగి యొక్క శారీరక మరియు మానసిక స్థితిగతులను క్షుణ్ణంగా విచారించి, వాటికి అనువైన చికిత్స ఇవ్వడం జరుగుతుంది. అంతేకాకుండా, కీళ్ళలో యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు ఏర్పడకుండా చూసి, రక్తప్రసరణలోని వివిధ రసాయనాల సమతుల్యతను కాపాడటం ద్వారా గౌట్ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు.




హోమియోకేర్ ఇంటర్‌నేషనల్
వరల్డ్-క్లాస్ హోమియోపతి

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం 955 000 1199

www.homeocare.in

ఎమ్వీ రామిరెడ్డి

# ముళ్లూ పూలూ





**"ఈరోజు కాన్వొకేషన్. సుమకు గోల్డ్‌మెడల్ ఇస్తారట. మీరూ వస్తే..." బేలమొహంతో అంది లక్ష్మి.**

**పనిమీద వెళ్లేటప్పుడు పనికిమాలిన సలహాలివ్వొద్దని లక్షసార్లు చెప్పుంటా. ఈ శాల్తీ ఇంతే. అందుకే, నేనేమీ మాట్లాడకుండా టిఫిన్ తింటూ వాట్సాప్‌లో మునిగిపోయాను.**

**"నాన్నా, ప్రిన్సిపల్ మేడమ్ మీ గురించి అడిగారు. పది నిమిషాలైనా వచ్చివెళ్లలేరా?" దీనంగా అడిగింది సుమ.**

**ఇదే తనతో గొడవ. ఫంక్షన్లలో, బిజినెస్ మీటింగుల్లో కూడా డాడ్ అనదు. అదేమంటే, తెలుగుభాషపై లెక్చరిస్తుంది. కవిత్వం గురించీ సమానత్వం గురించీ మాట్లాడుతుంది.**

"ఐ విల్ ట్రై. ఈవెనింగ్ మినిస్టర్ గారితో అపాయింట్‌మెంట్. పెద్ద ప్రాజెక్టు. పని తొందరగా అయిపోతే వస్తా. అయినా మీ ప్రిన్సిపల్ ప్రేమ నా మీదకాదు; నేనొస్తే ప్రకటించే డొనేషన్ మీద" సింక్‌లో చేతులు కడుక్కుంటూ చెప్పాను.

నేను ఫీలయ్యాననుకుందేమో, "ఇందాక సతీశ్ బాబాయ్ ఫోన్ చేశాడు. ఈ రాత్రికి వస్తున్నాట్ట. నా ప్రాజెక్ట్ వర్క్ తనకు బాగా నచ్చిందట..." సాంత్వన వాక్యాలు బయటకు తీయబోయింది.

"ఇంకేంటి?" ఆ వ్యవహారాలు బొత్తిగా నాకిష్టం లేవని తెలియజెప్పే స్వరప్రయోగంలో నేను దిట్ట.

"నాన్నా, ముఖ్యమైన విషయం. కేతన్‌ని మీరలా గుడ్డిగా నమ్మొద్దు. కాస్త ఎంక్వైరీ చేయండి. గాడి తప్పాక బాధపడితే ప్రయోజనముండదు..."

"రాత్రే మూర్తితో మాట్లాడాను. నువ్వు చెప్పిందంతా నిజం కాదు. వాడు వారానికోసారి ప్రిన్సిపల్‌తో మాట్లాడుతున్నాడు. ఎవ్రిథింగ్ ఈజ్ ఆల్‌రైట్ అని చెప్పాడు..." కోపం పొంగుకొచ్చింది.

కుళ్లు. వాడెక్కడ డాక్టరైపోతాడోనని అమ్మాకూతుళ్లకు కడుపుబ్బరం.

చేతన్ ఎలా ఉన్నాడో! వాడు కన్‌ఫర్మ్‌గా ఐఐటీ కొడతాడు. చాలు; ఒకడు డాక్టర్, ఇంకొకడు ఇంజినీర్. చెల్లి ఆత్మకు ఇంతకన్నా శాంతినిచ్చే మార్గం ఉంటుందనుకోను. సెల్‌ఫోన్ టవర్ల ఏర్పాటు ఇంత పెద్ద వ్యాపారంగా విస్తరిస్తుందని తొలిరోజుల్లో ఊహించలేదు.

అమ్మ ఆరోగ్యం దెబ్బతిన్నప్పుడు సపర్యలు చేయటానికి లక్ష్మి మా పల్లె నుంచి వచ్చింది. అమ్మకు తెగ నచ్చేసి, "పెళ్లి చేసుకుంటే లక్ష్మీదేవి కలకాలం మనింట్లో ఉంటుందిరా" అంది.

డిగ్రీ చదివే రోజుల్లో పేదింటి పిల్లను పెళ్లి చేసుకోవాలన్న ఆదర్శం ఉండేది. అమ్మ మాట కాదనలేకపోయాను. లక్ష్మిని కూచోబెట్టి, మాట్లాడాను.

"మా చెల్లి నా ఆరోప్రాణం. ఆరోగ్యం తక్కువ మనిషి. మనమే చూసుకోవాలి. పెళ్లి చెయ్యాలి. అవసరమైతే సంసారం కూడా మనమే ఈదాలి" వివరంగా చెప్పాను.

ఏ మాటకామాట. తానొక్కటే అన్నీ అయి చెల్లి పెళ్లిపనులు చక్కబెట్టింది. పెట్టుపోతల్లో దొడ్డమనసు చాటుకుంది. సాఫ్ట్‌వేర్ ఇంజినీరుతో చెల్లి పెళ్లి ఘనంగా చేశాను. కేతన్, చేతన్‌లు పుట్టారు. ముచ్చటపడి పెట్టుకున్నాను ఆ పేర్లు. ఆరో పెళ్లిరోజున మృత్యువు ముంచుకొచ్చి చెల్లి వెళ్లిపోయింది.

నేను ప్రాక్టికల్ మనిషిని. బావను ఓదార్చాను. ఒప్పుకోకపోయినా; నచ్చజెప్పి, మరో పెళ్లి చేశాను. పిల్లలిద్దర్నీ నా ఇంటికి తెచ్చుకున్నాను. అప్పటికి సుమకు అయిదేళ్లు.

అబ్బాయిల్ని లక్ష్మి అక్కున చేర్చుకుంది. కుటుంబ నియంత్రణ పాటించి, 'ఇక చాలత్తయ్యా. ఇప్పటికే ముగ్గురు పిల్లలు' అందట మా అమ్మతో. 'కోడలెంత గుణవంతురా'లంటూ అమ్మ మెటికలు విరిచిందేగానీ, నాకంటూ ఇంతయినా ప్రశంసను ప్రకటించలేదు.



చదువుల విషయంలో నాక్కొన్ని లక్ష్యాలున్నాయి. సీటొచ్చినా, ఫీజు కట్టే స్థోమత లేని కారణంగా నేను ఇంజినీర్ని కాలేకపోయాను. మా అమ్మాయి ద్వారా ఆ కోరిక తీర్చుకోవాలనుకున్నాను. మంచి కాన్వెంట్లలో చదివించాను. కేతన్, చేతన్‌లపైనా లక్ష్యాలు నిర్దేశించుకున్నాను. వాళ్లను ఇంటర్నేషనల్ స్కూళ్లలో వేశాను. ఇంట్లో ఇంగ్లీషులోనే మాట్లాడాలని కట్టడి చేశాను. మేనల్లుళ్లిద్దరూ ఫ్లూయంట్‌గా మాట్లాడేవాళ్లు. సుమ మాత్రం తెలుగులోనే మాట్లాడేది. ఇంగ్లిషు రాక కాదు; మాట్లాడ్డం ఇష్టం లేక.

సుమకు ఇంటర్‌లో తొంబై శాతం మార్కులొచ్చాయి. ఎమ్‌సెట్‌లో మంచి ర్యాంకు వచ్చింది. కానీ, ఇంజినీరింగ్‌లో చేరనంది. అదేదో 'బ్యాచిలర్ ఆఫ్ సోషల్ వర్క్' అట. సుతరామూ నాకిష్టం లేదని తేల్చిచెప్పినా వినలేదు.

బావమరిది తన కొడుక్కి అక్షరాభ్యాసం అంటే వెళ్లాను లక్ష్మి, సుమలతో కలిసి. ఒక విద్యావేత్తతో అక్షరాలు దిద్దించాడు. పిల్లల



అక్షరాభ్యాసం అంటే బాసరకో, కాణిపాకానికో వెళ్తారు. వీడికదేం పిచ్చో నాకర్థం కాలేదు.

"నువ్వేం చదువుతున్నావమ్మా?" తంతు ముగిశాక మా అమ్మాయిని అడిగాడాయన.

"ఇంటర్ పూర్తయింది తాతగారూ. సోషల్ సైన్సెస్‌లో గ్రాడ్యుయేషన్ చేద్దామనుకుంటున్నా" చెప్పింది.

"మంచి నిర్ణయం. ఇవాళ్టి అవసరం. కొన్ని దేశాలలో టెక్నికల్ ఎడ్యుకేషన్‌లో కూడా సోషల్ సైన్స్‌ను కంపల్సరీ సబ్జెక్టు చేశారు ..." ఇంకా ఏదేదో చెప్పాడు. ఓ విద్యావేత్త అలా మాట్లాడటం నాకు నచ్చలేదు. అమ్మాయి సంగతేమో కానీ, మా ఆవిడ మాత్రం తెగ ఇంప్రెస్ అయిపోయింది. ఇంకేముంది, సుమ బీఎస్‌డబ్ల్యూలో చేరింది. డిగ్రీలో కాలేజ్ ఫస్ట్ వచ్చింది.

పోనీ, అప్పుడైనా ఎంబీఏ చేయమని చెప్పాను. విన్లేదు. 'మాస్టర్ ఆఫ్ సోషల్ వర్క్'లో చేరింది. ఎప్పుడు చూసినా కమ్యూనిటీ అనీ, ప్రభుత్వ పాఠశాలల్లో సదుపాయాలనీ తిరుగుతుండేది. రైతులు, నేత కార్మికులు ఆత్మహత్యలు చేసుకుంటున్న ప్రాంతాల్లో పర్యటించి, ఏవో రిపోర్టులు తయారు చేసేది. వేతనాల విషయంలో మహిళాకూలీలకు జరుగుతున్న అన్యాయంపై పత్రికల్లో వ్యాసాలు రాసేది. సెక్స్ వర్కర్లను కలిసి, వారికి అవేర్‌నెస్ కల్పించే కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేది.

"నాన్సెన్స్, ఏమిటివన్నీ? నువ్వెక్కడెక్కడ తిరుగుతున్నావో నీకర్థమవుతోందా?" గద్దించేవాణ్ని.

"అవన్నీ నేను సందర్శించే ఆలయాలు నాన్నా" అనేది. వెధవ కవిత్వం ఒకటి! అయిదారు హెచ్చరికలు అలా సబ్బునీటి బుడగల్లా పేలిపోయాక, ఇక ఆ ప్రయత్నం మానేశాను.

అయినా, ఆడపిల్లకు ఇంజినీరింగులు అవసరమా? ఆఫ్టరాల్, సోషల్ సైన్సులు చాలు! సరిపెట్టుకున్నా. ఇంకా ఇద్దరున్నారు. మేనల్లుళ్ల కాదు. ఇప్పుడు నా కొడుకులు. రెండు వజ్రాలు.

కేతన్ టెన్త్‌లో తొంభై అయిదు శాతం సాధించాడు. ప్రముఖ కార్పొరేట్ కాలేజిలో ఇంటెన్సివ్ కేర్ బ్యాచ్‌లో చేర్పించాను. కోరి మరీ బైపీసీ తీసుకున్నాడు. ఫస్టియర్ ఇరగదీశాడు. ఎమ్‌సెట్‌లో వందలోపు ర్యాంకు గ్యారంటీ అన్నాడు. అబ్బాయిలిద్దరికీ ఏదీ తక్కువ కాకుండా జాగ్రత్త పడ్డాను. రాజీ పడకుండా ఫీజులు కట్టాను. దండిగా జేబుఖర్చులిచ్చాను. దర్జాగా బతికేలా ధైర్యమిచ్చాను. దురదృష్టవశాత్తు సెకండియర్లో మార్కులు తగ్గాయి. ఎమ్‌సెట్ ర్యాంకు అయిదంకెలు దాటింది. కేతన్ బిక్కమొహం వేశాడు. ఏడ్చాడు. నాకు జాలి కలిగింది.

చివరకి బెంగుళూరు మెడికల్ కాలేజీలో కేతన్‌కు సీట్ కన్‌ఫర్మ్ అయింది. మేనేజ్‌మెంటు కోటా. తెలిసిన వాళ్ల ద్వారా కోటిన్నరకే దొరికింది. వాడి బాగోగుల గురించి ఆరాతీసే బాధ్యతను బెంగుళూరులో ఉండే నా చిరకాల మిత్రుడు మూర్తికి అప్పగించాను. వాణ్ని హాస్టల్లో వదిలి వచ్చిన నాలుగోరోజే మూర్తికి ఫోన్ చేసి, "ఓసారి కాలేజీకి వెళ్లి ప్రిన్సిపల్ మొబైల్ నంబరు తీసుకో. వీడు కాలేజీకి సరిగా వెళ్తున్నాడో లేదో, బాగా చదువుతున్నాడో లేదో వారానికోసారి ఆరా తియ్యి" అని చెప్పాను.

కేతన్ మొదటి సంవత్సరం మంచి మార్కులు తెచ్చుకున్నాడు. సెకండియర్ కొద్దిగా తగ్గాయి. ఫర్వాలేదంటూనే హెచ్చరికలూ జారీ చేశాను. ఇప్పుడు ఎంబీబీఎస్ మూడో

"మీ ఎన్నారైలకు నాలుగు డబ్బులు సంపాదించగానే పేదలు గుర్తొస్తారు! మెడికల్ క్యాంపులూ అన్నదానాలూ చేసి, ఆనక రాజకీయ నాయకులై పోతారు" వెటకారం మిక్స్ చేసి వదిలాను. సతీశ్ పెద్దగా నవ్వేసి, "మీరు మారరన్నయ్యా" అని, "ఓకే సుమా, బై. నాన్న మాటలు పట్టించుకోకు. వచ్చే శనివారం ఇనాగురల్ ఫంక్షన్ ఫిక్స్ చేసెయ్" అంటూ బయటికి నడిచాడు.

సంవత్సరం. కేతన్ కాలేజీకి సరిగా వెళ్లటం లేదనీ, ఫ్రెండ్స్ ఎక్కువయ్యారనీ, సినిమాలూ షికార్లూ మోతాదు మించాయనీ ... నిన్న మధ్యాహ్నం మరోసారి చెప్పింది సుమ. వెంటనే మూర్తికి ఫోన్జేశాను. తను రెగ్యులర్‌గా ప్రిన్సిపల్‌తో మాట్లాడుతున్నాననీ, అంతా సవ్యంగానే ఉందనీ చెప్పాడు.

• • •

పొద్దున్నే పేపర్ చదువుతుండగా, సుమ వచ్చి జిల్లా ఎడిషన్‌లో తను గవర్నర్ చేతుల మీదగా గోల్డ్‌మెడల్ అందుకుంటున్న ఫొటోవార్త చూపించింది. నేను కంగ్రాట్స్ చెప్పాలా వద్దా అన్న సందిగ్ధంలో ఉండగా, "హాయ్ అన్నయ్యా" అంటూ సతీశ్ వచ్చాడు.

"హాయ్ హాయ్, ఎలా ఉన్నావ్? బిజినెస్ ఎలా ఉంది?" అడిగాను.

వాడికి ఆస్ట్రేలియాలో పదిహేను గ్యాస్‌స్టేషన్లు ఉన్నాయి. ఈమధ్యే ఇన్‌ఫ్రా



బిజినెస్ మొదలెట్టాడు. అదీ ఎత్తుకుంది. నలభై నిండకముందే నిండా డాలర్లలో మునిగిపోయాడు.

"అంతా బాగుందన్నయ్యా. హాయ్ సుమా. పేపర్లో చూశాను. కంగ్రాట్స్ కన్నమ్మా" అన్నాడు.

"ధన్యవాదాలు బాబాయ్" అంది వాడి పాదాలు స్పృశిస్తూ.

"వావ్, వినటానికి ఎంత బాగుంది" సతీశ్ సుమను పైకి లేపి, గుండెలకు హత్తుకున్నాడు.

మా ఆవిడ ఇచ్చిన కాఫీ తాగి, "సుమా, ఏదీ ఆ ప్రపోజల్? ఈరోజు ఫైనల్ చేసేద్దాం. అన్నయ్యా, మీరు కూడా డిస్కషన్‌లో పార్టిసిపేట్ చేయకూడదూ!" అన్నాడు.

"నోనో, నేనర్జంటుగా రెడీ అవ్వాలి. ఇంపార్టెంట్ మీటింగుంది" బాత్‌రూము వైపు నడిచాను. నలభై నిమిషాల తర్వాత, ఆఫీసుకు సిద్ధమై, సోఫాలో కూచుంటూ "టిఫిన్ ఇక్కడికి తెచ్చెయ్" అన్నాను లక్ష్మితో.

"ఇట్స్ ఫైనల్. గో ఎహెడ్" సుమతో అని, నా వైపు తిరిగాడు సతీశ్.

"నేను పదేళ్ల క్రితం చౌటుప్పల్ దగ్గర కొన్న ఆరెకరాలూ ఈ ప్రాజెక్టుకు కేటాయిస్తున్నానన్నయ్యా. ఒకేచోట ఓల్డేజ్ హోమ్, ఆర్ఫన్స్ చిల్డ్రన్ హోమ్, స్కూలు వంటివి స్టార్ట్ చేస్తున్నాం. అంతా సుమే చూసుకుంటుంది. తనకు మంచి టీముంది. అదే ఉద్యోగం, అదే జీవితం. శాలరీ తనే ఫిక్స్ చేసుకుంటుంది. ఈ సర్వీస్ ఇన్‌స్టిట్యూట్ నడపటానికి కోటి రూపాయలిచ్చినా సుమలాంటి వ్యక్తి దొరకరు. ముందుగా.. అక్కడున్న గెస్ట్‌హౌస్‌ను రెనొవేట్ చేసి, డ్రగ్ డీ అడిక్షన్ సెంటర్ స్టార్ట్ చేయాలనుకుంటున్నాం".

"మీ ఎన్నారైలకు నాలుగు డబ్బులు సంపాదించగానే పేదలు గుర్తొస్తారు! మెడికల్ క్యాంపులూ అన్నదానాలూ చేసి, ఆనక రాజకీయ నాయకులైపోతారు" వెటకారం మిక్స్ చేసి వదిలాను.

సతీశ్ పెద్దగా నవ్వేసి, "మీరు మారరన్నయ్యా" అని, "ఓకే సుమా, బై. నాన్న మాటలు పట్టించుకోకు. వచ్చే శనివారం ఇనాగురల్ ఫంక్షన్ ఫిక్స్ చేసెయ్" అంటూ బయటికి నడిచాడు.

సుమ నిరసనతో కూడిన చూపొకటి నా మీదికి విసిరేసి, లోపలికి వెళ్లింది.

• • •

ఆఫీసులో కూచున్నానేగానీ, ఆందోళనగా ఉంది.

కేతన్ ఇప్పుడు నాలుగో సంవత్సరం. నాలుగు రోజులుగా వాడి ఫోను పని చెయ్యటం లేదు. వాడి ఫ్రెండ్స్‌కు ఫోన్ చేసినా అజ దొరకలేదు. మూర్తికి చేశాను. "నేను వారం క్రితం ముంబై వచ్చా. బెంగుళూరుకు రేపు వెళ్తున్నా. వెళ్లగానే కేతన్‌తో మాట్లాడిస్తాలే" అన్నాడు.

ఆ ఫోను కోసం ఉదయం నుంచీ ఎదురుచూపు. మూడుసార్లు మూర్తికి చేశాను.

ఇదుగో అదుగో అని మొత్తానికి పది నిమిషాల క్రితం కాలేజీకి చేరుకుని, కేతన్ గురించి ఆరా తీస్తున్నాడు. నలభై నిమిషాల భయంకర నిరీక్షణ అనంతరం ఫోన్ మోగింది.



"రామ్, నువ్వు వెంటనే బయల్దేరి ఫ్లైట్‌లో బెంగుళూరొచ్చేయ్" మూర్తి గొంతులో కంగారు.

"వాట్ హేపెన్స్? ఎనిథింగ్ సీరియస్?" నాకు చెమట్లు పట్టాయి.

"నథింగ్ టు వర్రీ. మనం ప్రిన్సిపల్‌ను కలవాలి. కొంచెం మాట్లాడాలి".

"అవన్నీ తర్వాత. కేతన్ ఎలా ఉన్నాడు? వాడికేం కాలేదుగదా!"

"వాడు బాగానే ఉన్నాడులే. నువ్వొచ్చెయ్" ఫోన్ పెట్టేశాడు.

మూడున్నర గంటల దుర్భర కాలసముద్రం దాటి, కేతన్ చదివే కాలేజీకి చేరుకున్నాను. మూర్తి కలిశాడు. శోకమూర్తిలా ఉన్నాడు. ఇద్దరం క్యాంటీన్‌లో కూచున్నాం.

"మోసపోయాం రా" బాధగా అన్నాడు. వాడి మాటల బరువు టన్నుల్లోకి చేరింది.

"ఏమైందిరా?" అడిగాననే అనుకున్నాను. పిచ్చిచూపులు తప్ప మాట పెగల్లేదు. వాడే మొదలుపెట్టాడు...

"పొద్దున ప్రిన్సిపల్‌ను కలిశాను. మన వాడి చిట్టా విప్పాడు. ఎప్పుడోగానీ క్లాసుకు రాడట. ఫ్రెండ్సూ, ర్యాగింగూ, సినిమాలూ, అమ్మాయిల్ని ఏడిపించటాలూ, రాత్రంతా హాస్టల్ రూములో మందు కొట్టడాలూ... ద మోస్ట్ అన్‌డిసిప్లిన్‌డ్ గై అట. థర్డ్ ఇయర్‌లో ఒక్క సబ్జెక్టూ పూర్తి కాలేదట. సెకండియర్‌లోనూ బ్యాక్‌లాగ్స్ ఉన్నాయట..."

"ఎలా రా? మార్కులిస్టులు చూపించేవాడు! ఒక్క సబ్జెక్టు కూడా లేదన్నాడు!"

"అంతా మాయ రా. డిజిటల్ మాయ. ప్రతిదాన్నీ డబ్బుతో కొనేవాడట..."

"మరి నువ్వు ప్రతి వారం ప్రిన్సిపల్‌తో మాట్లాడుతూనే ఉన్నావు కదా. ఎప్పుడడిగినా కేతన్ రెగ్యులర్‌గా కాలేజీకి వస్తున్నాడనీ బాగా చదువుతున్నాడని చెబుతున్నాడనీ అనేవాడివి గదా".

"ఈ విషయంలోనే నేను వెర్రివాణ్ణి అయ్యాను..."

అర్థం కానట్టు అయోమయంగా చూశాను.

"కేతన్ చేరిన నాలుగురోజులకే నువ్వు ప్రిన్సిపల్‌ను కలవమని చెప్పావు. నేను కాలేజీకి వెళ్లాను. ప్రిన్సిపల్ లేడని చెప్పి, ఆయన ఫోన్ నంబరు నాకిచ్చాడు. మధ్యలో ఎన్నిసార్లు వెళ్లినా ఆయన లేరు. ఫోన్‌లో చక్కగా సమాధానం చెప్పేవాడు. అయితే, ఇవ్వాళ తెలిసింది... ఆ ఫోన్ నంబరు కేతన్ రూమ్‌మేటుదనీ, అతనే ప్రిన్సిపల్‌లా మాట్లాడేవాడనీ..."

నాకు నవ్వాలో ఏడ్వాలో అర్థం కాలేదు. నేను కాలేజీకి వచ్చిన ప్రతిసారీ ప్రయత్నించేవాణ్ని, ప్రిన్సిపల్‌ను కలవడానికి. కేతన్ ఉద్దేశపూర్వకంగా మా కలయికను అడ్డుకున్నట్లు ఇప్పుడర్థమవుతోంది. అట్టే వెయిట్ చెయ్యటానికి నాకేమో టైముండేది కాదు.

"వాడు డ్రగ్స్‌క్కూడా బానిసయ్యాడట. మొన్న రాత్రి హాస్టల్లో రెండు గ్రూపుల మధ్య గొడవ జరిగింది. కేతన్ రాడ్‌తో దాడి చేయటంతో సెకండియర్ స్టూడెంట్ కోమాలోకి వెళ్లాడు. కేతన్ మీద హత్యాయత్నం కేసు నమోదైంది. ఒకరోజంతా స్టేషన్లో ఉంచారు. పోలీసులు కొట్టినా నీ నంబరు చెప్పలేదట. విషయం ప్రిన్సిపల్ దాకా వెళ్లింది. ఆయన తన దగ్గరున్న నంబరుకు ఇన్‌ఫామ్ చేశాడు. కేతన్ గార్డియన్‌గా ఆయన దగ్గర అదే నంబరుందట..."

"ఇంతకీ ఎవరిదా నంబరు?" ఆత్రంగా అడిగాను.




ముందు ముందు నీకే తెలుస్తుందన్నట్టు మర్మగర్భంగా నవ్వాడు మూర్తి.

• • •

చౌటుప్పల్ దాటాక కారు కుడివైపు తిరిగింది. ఓ కిలోమీటరు డొంకదారిలో ప్రయాణించి పెద్ద గేటులోంచి లోపలికి ప్రవేశించింది.

"సార్ ... వచ్చేశాం" డ్రైవర్ తట్టి లేపేదాకా, నేను ఏదో లోకంలో ఉన్నాను.

కారు దిగి ఆఫీసులోకి నడిచాను. 'ఎవరు కావా'లని అడిగింది రిసెప్షనిస్టు. చెప్పాను. నన్ను వెంటబెట్టుకుని ఓ హాలు దగ్గరకు తీసుకెళ్లింది. లోపలికెళ్తూ తల పైకెత్తి చూశాను. 'మాదకద్రవ్య వ్యసన విమోచన కేంద్రం' అనే అక్షరాలు ఎండకు మెరుస్తున్నాయి. అది 'డ్రగ్ డీ-అడిక్షన్ సెంటర్' అని అర్థం కావటానికి కాస్త సమయం పట్టింది.

ఆ హాలుకు ఉత్తరంగా నూతన భవన నిర్మాణం జరుగుతోంది. బయట బోర్డు పెట్టి ఉంది - 'వృద్ధాలయం నిర్మాణంలో ఉన్నది'. ఇట్స్ నాట్ హోమ్, ఇట్స్ టెంపుల్ ఫర్ ఎల్డర్లీ. ఎంత అద్భుత భావన! తెలుగు ఇంతందంగా ఉంటుందా! వెయిటింగ్ హాల్లో కుర్చీ చూపిస్తూ "ఇక్కడుండండి సార్..." అంటూ వెళ్లిందామె. అలసటగా వెనక్కి వాలి, కళ్లు మూసుకున్నాను. మూర్తి మాటలు వెంటాడుతున్నాయి...

"అవును. సంవత్సరంన్నర నుంచీ తనే ప్రిన్సిపల్‌కు టచ్‌లో ఉంటుందట. వీడ్ని మార్చటానికి ఎన్నో ప్రయత్నాలు చేసిందట. నువ్వు ఫ్లైట్‌లో వచ్చేలోపు మూడుసార్లు తనతో మాట్లాడాను. చాలా బాధ పడింది. ప్రిన్సిపల్ ఫోన్జేయటంతో తనే బెంగుళూరు వచ్చి, బెయిల్ సంపాదించి, కేతన్‌ని తనతో తీసుకెళ్లిందట. వాడు పెడదారి పట్టాడని తను మొత్తుకున్నా నువ్వు నమ్మలేదని బాధగా చెప్పింది. ఈ విషయాలన్నీ నీకిప్పుడే చెప్పొద్దంది. కానీ, నా తప్పిదం ఉంది కాబట్టి, జరిగిందంతా నీకు చెప్పాలనిపించి ఇక్కడికి పిలిపించాను..."

పది నిమిషాల తర్వాత వచ్చింది సుమ. సంవత్సర కాలంగా వారానికొక్కసారో రెండుసార్లో ఇంటికి వస్తోంది. చాలా రోజుల తర్వాత నా కూతుర్ని ఆర్తి నిండిన కళ్లతో చూశాను.

"నాన్నా. కేతన్ గురించేగా? భయపడాల్సిందేమీ లేదు. బాగానే ఉన్నాడు. చికిత్స జరుగుతోంది. కోలుకుంటున్నాడు. మీకసలు విషయం తెలియదు. కాస్త మామూలు మనిషి కాగానే అహం దెబ్బ తిని, వాడు పిచ్చిగా ప్రవర్తించాడు. 'నీ దయాదాక్షిణ్యాలతో నేను బతికి బట్టకట్టకూడదు' అంటూ రాత్రి ఆత్మహత్యకు ప్రయత్నించాడు..."

భళ్లున ఏడ్చేశాను. తను దగ్గరగా వచ్చి, అమ్మలా హత్తుకుని, ఓదార్చింది.

"చూస్తారా..." రెండు నిమిషాల తర్వాత అడిగింది. తలూపాను. లోపలి గది తలుపు తీసి పట్టుకుని, కళ్లతో రమ్మని పిలిచింది.

నేను రెండడుగులు ముందుకేసి, 'చూళ్లేను' అన్నట్టు తల అడ్డంగా ఊపి, అక్కణ్నుంచి బయటికి నడిచాను. పదడుగులు వేశాక, ఓసారి వెనక్కి తిరిగి చూశాను. సుమ మెట్ల దగ్గర నిలబడి ఉంది - మదర్ థెరిసాలా!

కారులో వెనక సీట్లో కూచున్నాను. శరీరం నిండా గుచ్చుకున్న ముళ్లు రాలిపోతున్నాయి. తగలబడుతున్న మనశ్శరీరాలు తడిదేరుతున్నాయి. దశాబ్దాలుగా ఘనీభవించిన అభిప్రాయాలు కరిగి, కమనీయ పుష్పాలుగా వికసిస్తున్నాయి.

"సార్, ఇప్పుడెక్కడికి?" అడిగాడు డ్రైవర్.

"నేరుగా చేతన్ దగ్గరకు పోనివ్వు. వాడితో ముఖ్యమైన విషయం మాట్లాడాలి".

ప్రశాంతంగా సీటుకు చేరగిలబడి కూచుని, చాలా ఇష్టంగా ఫోన్ తీశాను, లక్ష్మితో మాట్లాడటానికి.

రచయిత సెల్ : 98667 77870

# కమ్మని 'నిమ్మ' రుచులు



## లెమన్ ఇడ్లీ (కుకీస్)

**కావలసిన పదార్థాలు:**

మైదా- రెండున్నర కప్పులు, తినే సోడా- చిటికెడు, ఉప్పు- ఒక టీ స్పూను, వెన్న- అర కప్పు, చక్కెర పొడి- రెండు కప్పులు, గుడ్లు- 2, పనీర్ తురుము- పావు కప్పు, నిమ్మతొక్క తురుము- ఒక టీ స్పూను, నిమ్మరసం- మూడు టేబుల్ స్పూన్లు.

**తయారీ విధానం:**

ఒక గిన్నెలో వెన్న, చక్కెర పొడి వేసి బాగా గిలక్కొట్టాలి. తర్వాత గుడ్లు, పనీర్ తురుము వేసి బాగా కలపాలి. తర్వాత మిగిలిన పదార్థాలన్నింటినీ కలిపి అరగంట పక్కన పెట్టుకోవాలి. తర్వాత ఇడ్లీ కుక్కర్‌లో ఇడ్లీల్లా వేసుకుని, 5 విజిల్స్ వచ్చేదాకా ఉడికించి దించేయాలి. వెన్న లేదా నెయ్యితో తింటే ఇవి చాలా బాగుంటాయి.



## నిమ్మ లడ్డూ

**కావలసిన పదార్థాలు:**

నిమ్మరసం- పావు కప్పు, మైదా- 3 కప్పులు, తినే సోడా- అర టీ స్పూను, చక్కెర పొడి- మూడు కప్పులు, చక్కెర- పావు టీ స్పూను, వెన్న- ఒక కప్పు, గుడ్డు- ఒకటి, నిమ్మ తొక్కల తురుము- ఒక టేబుల్ స్పూను, వెనీలా ఎసెన్స్- అర టీ స్పూను.

**తయారీ విధానం:**

మైదాలో ఉప్పు, తినే సోడా వేసి బాగా కలిపి పక్కన పెట్టుకోవాలి. మరో గిన్నెలో వెన్న, ఒక కప్పు చక్కెర పొడి వేసి మెల్లిగా కలుపుతూ గుడ్లు, నిమ్మరసం, నిమ్మతొక్క తురుము, వెనీలా వేసి బాగా కలపాలి. తర్వాత మైదా మిశ్రమం, చక్కెర కూడా వేసి బాగా కలుపుకుని కుక్కర్‌లో 5 విజిల్స్ వచ్చేదాకా ఉడికించి, లడ్డూలు కట్టుకోవాలి. తర్వాత మిగిలిన చక్కెర పొడిలో ముంచి తీయాలి.



## మింట్ లెమినాడో

**కావలసిన పదార్థాలు:**

నిమ్మరసం- అర కప్పు, పుదీనా- అర కప్పు, అల్లం తురుము- పావు కప్పు, తేనె- పావు కప్పు, వేడి నీళ్లు- రెండు కప్పులు, నిమ్మకాయ- ఒకటి (గుండ్రని ముక్కలుగా కోసుకోవాలి), ఉప్పు- కొద్దిగా.

**తయారీ విధానం:**

పుదీనా తురుము, అల్లం, తేనె కలిపి వేడి నీటిలో అరగంట సేపు నానబెట్టాలి. తర్వాత నీటిని మాత్రమే వడపోసుకుని, పిప్పిని పిండేసి తీసివేయాలి. ఇందులో నిమ్మరసం, ఉప్పు, నిమ్మకాయ ముక్కలు వేసి ఒక రోజంతా ఫ్రిజ్‌లో నిల్వచేసి, తర్వాతి రోజు ఐస్‌ముక్కలు వేసి సర్వ్ చేయాలి.

ఫుడ్ కోర్ట్

## లెమన్ కేక్

**కావలసిన పదార్థాలు:**

నిమ్మరసం- పావు కప్పు, నిమ్మ తొక్కలు- 4 (సన్నగా తురుముకోవాలి), కస్టర్డ్ షుగర్- ఒకటిన్నర కప్పులు, మైదా- ముప్పావు కప్పు, పాలు- ఒకటిన్నర కప్పులు, వెన్న- పావు కప్పు, గుడ్లు- 4, తినే సోడా- అర టీ స్పూను.

**తయారీ విధానం:**

పదార్థాలన్నింటినీ ఒక గిన్నెలో వేసి బాగా గిలక్కొట్టాలి. తర్వాత 180 సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రత వద్ద ఒవెన్‌లో 25 నిమిషాలు లేదా కుక్కర్‌లో నీళ్ల పోయకుండా 6 విజిల్స్ వచ్చేదాకా ఉంచి దించేయాలి.








# అపాయంలో ఉపాయం!

ఒక అడవిలో సత్యసారం అనే సింహం ఉండేది. ఏదైనా జంతువు కనిపిస్తే చాలు పట్టి చంపేసేది. దాంతో కొద్ది కాలంలోనే ఆ అడవిలో జంతువులు బాగా తగ్గిపోయాయి. మిగిలిన జంతువులన్నీ ఒక చోట చేరి 'మృగరాజుని అడ్డుకునేదెవరు?' అని చర్చించాయి. కానీ ఎవరూ సింహాన్ని ఎదిరించడానికి ముందుకు రాలేదు. చివరకు నక్క చెప్పిన ఆలోచన ప్రకారం రోజుకో జంతువు తనంతట తానే సింహానికి ఆహారంగా వెళ్లేలా తీర్మానించాయి. దానికి నక్క సింహాన్ని ఒప్పించింది. ఆ రోజు నుంచి వంతుల వారీగా సింహానికి ఆహారంగా మారసాగాయి జంతువులు.

ఒకరోజు కుందేలు వంతు వచ్చింది. ఎప్పుడూ సంతోషంగా ఉండే కుందేలు ఆ వార్త విని బాధపడింది. తనకు వచ్చిన అపాయాన్ని ఎలా అయినా తప్పించుకోవాలనుకుని ఒక ఉపాయం ఆలోచించింది. సింహానికి ఆహారం కావడానికి సమయం మించిపోతున్నా అడవిలో అటూఇటూ తిరిగి కావాలనే ఆలస్యంగా వెళ్లింది. ఆకలితో అలమటిస్తోన్న సింహం కుందేలును చూస్తూనే



కోపంతో ఊగిపోతూ "ఏం చెవులపిల్లీ! మీ తీర్మానానికి ఒప్పుకున్నాను కదా అని నన్నే పరిహసిస్తున్నారా? ఎందుకు ఆలస్యం అయ్యింది. మళ్లీ మునుపటిలా నేను దాడికి దిగితే బాగుండునని అనుకుంటున్నారా?" అని గర్జించింది.

కుందేలు దీనంగా మొహం పెట్టి "మృగరాజా! నేను సమయానికే బయలుదేరాను. దారిలో మరో సింహం నన్ను అటకాయించింది. నేను మా రాజా వారికి ఆహారమవ్వాలి, వెళ్లనివ్వు అని బతిమాలినా వినిపించుకోలేదు. ఎవ్వడు మీ రాజు, నేనే ఈ అడవికి రాజును. నిన్నూ, మీ రాజునూ చంపేస్తాను అని బెదిరించింది" అంది.

ఆ మాటలతో సింహం కోపం రెట్టింపయ్యింది "నేనుండగా ఇంకో సింహం వచ్చి తానే అడవికి రాజునంటోందా? దాని సంగతి తేలుస్తా. ఎక్కడుందో చూపించు" అంది.

కుందేలు తన పాచిక పారినందుకు లోలోన ఆనందపడుతూ "రండి, ఆ సింహాన్ని చూపిస్తాను" అని ముందుకు దారి తీసింది. వెళుతూ వెళుతూ ఒకచోట ఆగి, బావిని చూపిస్తూ "ఇందులోనే ఉంది మృగరాజా, ఆ సింహం" అని చెప్పింది కుందేలు. వెంటనే గట్టుపైకి ఎక్కిన సింహం నీటిలో తన ప్రతిబింబాన్ని చూసి అదే మరో సింహమని భ్రమపడింది. తాను గర్జించినప్పుడు, లోపలి నుంచి ప్రతిధ్వని వచ్చేసరికి శత్రువు అంతుచూద్దామని ఆవేశంగా బావిలో దూకి ప్రాణాలు పోగొట్టుకుంది.




## దారి కనుక్కోండి





## రంగులు వేయండి

## SSENNIUG

స్పెల్లింగ్ చూసి కంగారు పడకండి. చదవడానికి కష్టపడకండి. 'గిన్నిస్' అనే మాటను తిరగేసి రాస్తే వచ్చిన స్పెల్లింగ్ అది. ఎందుకిలా అనుకుంటున్నారా? బెంగళూరుకు చెందిన 'శిశిర్' అనే యువ శాస్త్రవేత్త ఇలా 50 ఇంగ్లీషు పదాలకు 1 నిమిషం 22 సెకన్లలో చకచకా స్పెల్లింగ్‌లను తిరగేసి రాసి గిన్నిస్ రికార్డు సాధించాడు.

## బుచికి




## పట్టుకోండి చూద్దాం!

పిల్లలూ! ఈ బాక్స్‌లో కొన్ని స్పెల్లింగులు దాక్కున్నాయి. వాటికి ఆధారాలు పక్కనే ఉన్నాయి. ఆ స్పెల్లింగులను పెన్సిల్‌తో గుర్తించండి.

egg, snail, bee, frog, caterpillar, lamb, ladybug, butterfly, owl, sun

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| C | A | T | E | R | P | I | L | L | A | R | E |
| R | F | B | T | Y | V | I | L | Q | B | S | B |
| U | R | Y | W | S | D | F | V | N | U | N | C |
| F | O | E | A | V | M | L | Y | L | C | A | B |
| R | G | U | B | E | G | G | O | A | W | I | K |
| N | H | T | R | C | R | F | Y | D | B | L | I |
| O | W | L | G | H | V | T | A | Y | I | B | Q |
| M | N | P | O | T | G | L | E | B | S | Q | C |
| H | N | J | I | O | P | A | Q | U | V | G | H |
| F | C | N | L | F | I | M | B | G | F | Y | U |
| B | E | E | C | Y | Z | B | T | H | W | P | B |
| Y | B | U | T | T | E | R | F | L | Y | S | M |

## విలువెంత?

ఆపిల్ + ఆపిల్ + ఆపిల్ = 120

ఆపిల్ + అరటిపండ్లు + అరటిపండ్లు = 100

అరటిపండ్లు + బెర్రీ + ఆపిల్ = 105

అరటిపండు + బెర్రీ = ?

జవాబు: యాపిల్ - 40, అరటిపండు - 15, బెర్రీ - 20, విలువ = 35

## తేడాలు కనుక్కోండి

రెండు బొమ్మలూ ఒకేలా ఉన్నా, వాటిలో అయిదు తేడాలున్నాయి. అవేమిటో గుర్తించగలరా?

జవాబులు:

1. మొదటిబొమ్మలో పిట్ట వెనుక ఒక గీత లేదు. 2. రెండో బొమ్మలో అమ్మాయి నవ్వట్లేదు. 3. రెండో బొమ్మలో కాఫీ కప్పు దిశ మారింది. 4. మొదటి బొమ్మలో షటిల్ కాక్ ఒకటే ఉంది. 5. రెండో బొమ్మలో రింగాట ఆడుతున్న అబ్బాయి వెనుక బెంచీ లేదు.







# అనుగ్రహం

21 - 27 మే 2017

డాక్టర్ పి.ఎ. రామన్


**మేషం**

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. సకాలంలో పనులు పూర్తి చేస్తారు. బాధ్యతలు పెరుగుతాయి. సమర్థతతో రాణిస్తారు. పరిచయాలు బలపడతాయి. ఇంట్లో ప్రశాంతత నెలకొంటుంది. ఆది, సోమ వారాల్లో ఆశ్చర్యకరమైన సంఘటన లెదురవుతాయి. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది. పిల్లల చదువులపై శ్రద్ధ వహిస్తారు. దళారులను విశ్వసించవద్దు.


**తుల**

**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

మనోధైర్యంతో ముందుకు సాగుతారు. విమర్శలు, అభియోగాలకు దీటుగా స్పందిస్తారు. నిందించినవారే మీ ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. బంధువులతో సత్సంబంధాలు నెలకొంటాయి. నగదు, పత్రాలు జాగ్రత్త. బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. భార్యాభర్తల మధ్య సఖ్యత నెలకొంటుంది. క్రీడలు, వినోదాల పట్ల ఆసక్తి పెరుగుతుంది.


**వృషభం**

**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

మనోధైర్యంతో ముందుకు సాగుతారు. మంగళ, బుధ వారాల్లో పనులు మందకొడిగా సాగుతాయి. శకునాల ప్రభావం అధికం. బంధువులతో పట్టింపులు తలెత్తుతాయి. కొన్ని విషయాలు పట్టించుకోవద్దు. మీ తప్పిదాలను సరిదిద్దుకునేందుకు యత్నించండి. జీవిత భాగస్వామి ఆరోగ్యం కుదుటపడుతుంది. కీలక పత్రాలు, నోటీసులు అందుకుంటారు.


**వృశ్చికం**

**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

ఉన్నత పదవులు స్వీకరిస్తారు. బాధ్యతలు, పరిచయాలు విస్తరిస్తాయి. సాధ్యం కాని హామీలివ్వవద్దు. మీ ఇష్టాయిష్టాలను సున్నితంగా తెలియజేయండి. దూకుడుగా వ్యవహరించవద్దు. దుబారా ఖర్చులు అధికం. పొదుపు చేసిన డబ్బును ముందుగా తీసుకుంటారు. కొన్ని పనులు అనుకోకుండా సానుకూలమవుతాయి. పిల్లల అత్యుత్సాహాన్ని అదుపు చేయండి.


**మిథునం**

**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

శుభకార్యాల్లో పాల్గొంటారు. పనులకు ప్రణాళికలు రూపొందించుకుంటారు. ఖర్చులు అంచనాలను మించుతాయి. గురు, శుక్ర వారాల్లో కొత్త సమస్యలు తలెత్తే సూచనలున్నాయి. అప్రమత్తంగా వ్యవహరించాల్సిన సమయం. ప్రలోభాలకు, ఒత్తిళ్లకు లొంగవద్దు. అవకాశాలు చేజారిపోతుంటాయి. పట్టుదలతో శ్రమించండి. మీ కృషి త్వరలో ఫలిస్తుంది.


**ధనుస్సు**

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

మీదైన రంగంలో రాణిస్తారు. కష్టానికి తగిన ప్రతిఫలం అందుతుంది. రుణ, కుటుంబ సమస్యలు సద్దుమణుగుతాయి. ప్రముఖులతో సంప్రదింపులు జరుపుతారు. మీ ప్రతిపాదనలకు ఆమోదం లభిస్తుంది. అవసరాలకు డబ్బు అందుతుంది. పిల్లల విజయం సంతోషపరుస్తుంది. లైసెన్సుల పునరుద్ధరణలో అలక్ష్యం తగదు. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది.


**కర్కాటకం**

**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

వ్యవహార దక్షతతో రాణిస్తారు. అంచనాలు ఫలిస్తాయి. ఆదాయానికి తగిన ఖర్చులుంటాయి. ఆత్మీయులతో ఉల్లాసంగా గడుపుతారు. జీవిత భాగస్వామి వైఖరిలో మార్పు వస్తుంది. పిల్లల చదువుల గురించి ఆలోచిస్తారు. ఆరోగ్యం స్థిరంగా ఉంటుంది. టెండర్లు వేయడానికి అనుకూలమైన కాలం. పొదుపు పథకాలు లాభిస్తాయి. జూదాలు, పందేల జోలికి పోవద్దు.


**మకరం**

**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

సాహసించి నిర్ణయాలు తీసుకుంటారు. మీ మాటకు తిరుగుండదు. వ్యతిరేకులను సైతం మీ వైపునకు తిప్పుకుంటారు. పదవీయోగంలో ప్రతికూలతలు తొలగుతాయి. విలాసాలకు బాగా వ్యయం చేస్తారు. పనులు నిదానంగా సానుకూలమవుతాయి. అపరిచితులను దూరంగా ఉంచండి. సాధ్యం కాని హామీలివ్వవద్దు. కొన్ని విషయాల్లో గోప్యత పాటించండి.


**సింహం**

**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

అనుకూల ఫలితాలుంటాయి. నిర్దిష్ట ప్రణాళికలు రూపొందించుకుంటారు. ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. సంప్రదింపులు కొలిక్కి వస్తాయి. ఆది, సోమ వారాల్లో భేషజాలకు పోయి ఇబ్బందులెదుర్కొంటారు. సన్నిహితుల సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించండి.


**కుంభం**

**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

కొన్ని సమస్యల నుంచి బయటపడతారు. ఆందోళన తొలగుతుంది. రుణ యత్నం ఫలిస్తుంది. నిర్దిష్ట ప్రణాళికలతో యత్నాలు సాగిస్తారు. పనుల ప్రారంభంలో ఆటంకాలు ఎదురవుతాయి. మీపై శకునాల ప్రభావం అధికం. జీవిత భాగస్వామితో సఖ్యత నెలకొంటుంది. ఉద్యోగ బాధ్యతలలో అలక్ష్యం తగదు. మీ అలవాట్లు, బలహీనతలు అదుపులో ఉంచుకోండి.


**కన్య**

**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

శుభకార్యాన్ని ఆడంబరంగా జరుపుకుంటారు. మీ ఉన్నతిని కొంతమంది అపార్థం చేసుకునే ప్రమాదం ఉంది. కుటుంబ విషయాలు గోప్యంగా ఉంచండి. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. పెద్ద ఖర్చు తగిలే ఆస్కారం ఉంది. ఆది, గురు వారాల్లో లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. ఆధిపత్యం ప్రదర్శించవద్దు. బాధ్యతల నుంచి విముక్తులవుతారు.


**మీనం**

**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

విజ్ఞతతో వ్యవహరిస్తారు. ఎదుటివారికి మీ పట్ల గౌరవం పెరుగుతుంది. కొన్ని సమస్యలు తేలికగా పరిష్కారమవుతాయి. ఆదాయం ఫర్వాలేదనిపిస్తుంది. ఆరోగ్య విషయాల పట్ల ఆసక్తి కలుగుతుంది. ప్రతి అంశాన్నీ స్వయంగా తెలుసుకోవాలి. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాల్లో పాల్గొంటారు. పెద్దమొత్తం నగదు నిల్వలో జాగ్రత్త.

# లైంగిక వ్యాధుల నుంచి హోమియోతో విముక్తి

ప్రాణాంతక వ్యాధులలో ముఖ్యంగా చెప్పుకోదగినవి హెచ్ఐవి, హెపటైటిస్ బి, హెర్పిస్.

**అసలు హెచ్ఐవి అంటే ఏమిటి?**

హెచ్ఐవి వైరస్ శరీరంలో ఉంటే రోగనిరోధక శక్తి క్రమేణ బలహీనపడుతుంది. చివరకు ఎయిడ్స్ రూపంలో బయటపడుతుంది. హెచ్ఐవి వైరస్ మానవ శరీరాన్ని నివాసంగా మార్చుకుంటే శరీరాన్ని పూర్తిగా దెబ్బతీస్తుంది.

**హెచ్ఐవి, ఎయిడ్స్ ఒక్కటేనా?**

ఈ రెండూ ఒకటి కావు. ఒక వ్యక్తి శరీరంలో హెచ్ఐవి వైరస్ ఉన్నా అతన్ని ఎయిడ్స్ వ్యక్తి అని అనలేము. హెచ్ఐవి వైరస్ శరీరంలో ఉంటూ రోగనిరోధక వ్యవస్థను పూర్తిగా దెబ్బతీసి శరీరాన్ని పూర్తి బలహీనంగా మార్చినపుడు ఆ దశను ఎయిడ్స్ అని పిలుస్తారు. ఈ దశలో సీడీ 4 కౌంట్ 200 కన్నా తక్కువ ఉంటుంది. ఇన్ఫెక్షన్ సోకగానే 6 నుంచి 12 వారాలలోపు హెచ్ఐవి నిరోధక కణాలు కనిపిస్తాయి. ఇన్ఫెక్షన్ సోకిన తరువాత హెచ్ఐవి రోగనిరోధక కణాలు పుట్టడానికి మధ్య పట్టిన సమయాన్ని విండో పీరియడ్ అంటారు. ఈ విండో పీరియడ్‌లో హెచ్ఐవీ పరీక్షలో వైరస్ ఉండదు. అయినప్పటికీ ఈ వ్యక్తితో శృంగారంలో పాల్గొంటే భాగస్వామికి హెచ్ఐవి వచ్చే అవకాశం ఉంది.

**హెపటైటిస్ బి**

ఈ వ్యాధి ముదిరే వరకు ఎలాంటి లక్షణాలు కనిపించవు. చాలా మంది ఇతర వైద్యపరీక్షలు చేసుకున్నప్పుడు హెపటైటిస్ ఉన్నట్లుగా బయటపడుతుంది. మానవ శరీరంలో కాలేయం చాలా ముఖ్యమైనది. ఈ అవయవానికి వైరస్ సోకితే ఎన్నో సమస్యలు వస్తాయి. కాలేయానికి సోకే వైరస్‌లలో ముఖ్యమైనవి హెపటైటిస్ బి, హెపటైటిస్ సి. హెపటైటిస్ బి వైరస్ సోకగానే కొంత కాలం నిద్రాణంగా ఉంటుంది. మెల్లమెల్లగా కాలేయాన్ని నిర్వీర్యం చేస్తుంది. చివరకు ప్రాణాంతకంగా మారుతుంది. లివర్ కేన్సర్, లివర్ సిర్రోసిస్ రావడానికి కారణమవుతుంది. ఈ వైరస్ వల్ల కాలేయ కణజాలం క్రమక్రమంగా పాడవుతుంది.


**డా. మధు వారణాశి, ఎం.డి**
**ప్రముఖ హోమియో వైద్యులు**
**ప్లాట్‌నెం 188,**
**వివేకానందనగర్ కాలనీ,**
**కూకట్‌పల్లి, హైదరాబాద్**
**ఫోన్ : 8897331110**
**8886 509 509**




**ఎలా వ్యాపిస్తుంది? :** లైంగిక సంపర్కం ద్వారా, లాలాజలం, తల్లి పాలు, స్టెరిలైజ్ చేయని నీడిల్స్ వాడటం ద్వారా వ్యాపిస్తుంది. హెపటైటిస్ బి ఉన్న వ్యక్తి నుంచి రక్తం, నేత్రాలు, మూత్రపిండాలు తీసుకోవడం వల్ల కూడా వ్యాపిస్తుంది. డ్రగ్స్, పచ్చబొట్లు, బ్లేడ్లు ఒకరు ఉపయోగించినవి వాడటం, టూత్‌బ్రష్ ఇతరులవి వాడటం వల్ల కూడా వ్యాపిస్తుంది.

**లైంగిక వ్యాధులు**

లైంగిక వ్యాధులు శృంగారం ద్వారా వ్యాపిస్తాయి. పురుషుల్లో మూత్రం పసుపుపచ్చగా రావడం, పురుషాంగంపై చిన్న చిన్న కురుపుల మాదిరిగా రావడం, నొప్పి ఉండటం, లేకపోవడం జరిగినా ఇన్ఫెక్షన్స్ ఉండవచ్చు. స్త్రీలలో యోని ద్వారా వచ్చే స్రావాలు దుర్వాసనతో ఉండటం, పీరియడ్స్‌తో సంబంధం లేకుండా రక్తస్రావం కావడం, మూత్రంలో మంట, ఎక్కువసార్లు మూత్రానికి వెళ్లాల్సి రావడం, జననాంగాల దగ్గర గుల్లలు రావడం, దురద ఉండటం, ఒళ్లునొప్పులు, జ్వరం వంటి లక్షణాలుంటాయి. ఈ లక్షణాలు కనిపిస్తే హెర్పిస్, గనేరియా, సిఫిలిస్, హెచ్ఐవి, షాంకరాయిడ్‌పుండ్లు వంటి వ్యాధులు కావచ్చు.

**హోమియో చికిత్స**

వ్యాధి శరీరంలో ఏ భాగానికి వచ్చినా దాని మూలకారణాన్ని గుర్తించి చికిత్స చేయడం హోమియో చికిత్స ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. చాలా కేసుల్లో శస్త్రచికిత్స అవసరం లేకుండా నయం చేసే వీలుంది. వ్యాధి గమనం, తీవ్రత, రోగి పరిస్థితిని పరిగణలోకి తీసుకుని చికిత్స చేస్తే తప్పక పరిష్కారం లభిస్తుంది. హోమియో చికిత్స రోగనిరోధక శక్తిని పెంచి ఇమ్యునోమాడ్యులేటర్‌గా పనిచేస్తుంది. ఈ సమస్యలలో హోమియో వైద్యుని ఎంపిక చాలా ముఖ్యమైనది. అనుభవజ్ఞుడైన వైద్యుడు వ్యాధి మూలంగా శరీర భాగాలకు జరిగిన హాని, వ్యాధి వ్యాపించిన తీరును అంచనా వేయగలడు. హోమియో వైద్యునికి అనాటమీ, మెడిసిన్, పెథాలజీపై పూర్తి అవగాహన ఉండాలి. అప్పుడే పరిష్కారం లభిస్తుంది.

# పీసీఓడి పత్తా లేకుండా పోయింది

**రంజని** మెడిసిన్ చదువుతోంది. ఇంటర్న్‌షిప్‌లోకి ఎంటర్‌అయింది. అప్పుడే ఆమెకు ఆరోగ్య సమస్య మొదలయింది. మెన్సస్ మూడు, నాలుగు నెలలకోసారి వస్తోంది. అయిన ప్రతీసారి బ్లీడింగ్ ఎక్కువ అవుతోంది. శరీరంలో మార్పులు కనిపిస్తున్నాయి. ముఖంలో అవాంచిత రోమాలు, వెంట్రుకలు రాలిపోవడం జరుగుతోంది. ముఖం, ఛాతీ, చేతులు, కాళ్లపైన అవాంఛిత రోమాలు బాగా పెరిగాయి. ముఖంమీద మొటిమలు వచ్చాయి. ముఖం జిడ్డుగా తయారయింది. అక్కడక్కడా స్కిన్ టాగ్స్ వస్తున్నాయి. ఏదో తెలియని భయం ఆమెను ఉక్కిరిబిక్కిరి చేసింది. తెలియకుండానే ఒకరకమైన డిప్రెషన్‌లోకి వెళ్లింది. బరువు పెరుగుతుండటంతో తినడం కూడా బాగా తగ్గించింది. తను డాక్టర్ కదా.. అనే ఫీలింగ్‌తో సమస్యను ఎవరికీ చెప్పుకోలేక కొన్నినెలలు బాధపడింది. చివరకు అమ్మ ప్రోద్భలంతో మా దగ్గరకు వచ్చింది. తన సమస్యలన్నీ వివరించింది. పరీక్ష చేయిస్తే పాలిసిస్టిక్ ఒవేరియన్ డిసీజ్ అని తేలింది. చాలా మందికి ఇది యుక్తవయసులో కనిపిస్తుంది.

**మా అమ్మ ఒత్తిడితోనే డాక్టర్ మధువారణాశి దగ్గరకు వెళ్లాను. తన ట్రీట్‌మెంట్ వల్ల నార్మల్ మనిషి అవుతానని కలలో కూడా అనుకోలేదు. పీజీ ఎంట్రెన్స్‌లో గైనకాలజీలో సీటొచ్చింది. డాక్టర్ గారిచ్చిన ట్రీట్‌మెంట్ వల్ల కలిగిన ఆత్మవిశ్వాసంతోనే ఇది సాధించాను. థాంక్స్ టు డా. వారణాశి.**

ఇలాంటి కేసులు నేను రెగ్యులర్‌గా ట్రీట్ చేస్తూనే ఉంటాను. నువ్వు భయపడాల్సిన పని లేదు, త్వరగానే తగ్గిపోతుంది అని ధైర్యం చెప్పాను.

తన శారీరక లక్షణాలు, మానసిక లక్షణాలు చూస్తే అమ్మాయిది చాలా సున్నితమైన స్వభావం. త్వరగా ఏడ్చే స్వభావం ఉంది. చల్లదనం అంటే ఇష్టమని చెప్పింది. జీర్ణశక్తి చాలా తక్కువగా ఉంది. ఉదయం తీసుకున్న ఆహారం అరగక ఉబ్బరంగా ఉంటుందని చెప్పింది. ఆమె చెప్పిన లక్షణాలను ఆధారంగా చేసుకుని కొన్ని మందులు ఇచ్చాను. తేలికపాటి వ్యాయామం చేయమని సూచించాను. రెండు నెలల తరువాత మెన్సస్ వచ్చిందని చెప్పింది. నాలుగు నెలల తరువాత తనలో చాలాబెటర్‌మెంట్స్ కనిపించాయి. మొటిమలు తగ్గాయి. బరువు తగ్గింది. ముఖంలో కాంతి పెరిగింది. ప్రతి నెలా రెగ్యులర్‌గా వచ్చి మందులు తీసుకుంది. ఎనిమిది నెలల్లో ఆమె సమస్యలన్నీ పూర్తిగా తగ్గిపోయాయి. ఇప్పుడామె ఆరోగ్యవంతమైన జీవితం గడుపుతోంది.

## మట్టి వాసనలు

ప్రధాన స్రవంతిలోని పట్టణాల, నగరాల ముచ్చట్లు ఎవరైనా చెబుతారు కానీ, పల్లెసీమ ముచ్చట్లు చెప్పేవారే కరువయ్యారు. ఆ లోటు తీర్చడానికన్నట్లు కొత్త తొవ్వలు, కొత్త జనసమూహాలను వెతుక్కుంటూ, మారుమూల గ్రామాలకు కాలినడకన కలియతిరుగుతూ... చరిత్రకారుడు జయధీర్ తిరుమలరావు అక్షరబద్ధం చేసిన 'తొవ్వ ముచ్చట్లు' ఇవి. మట్టివాసనలతో మనసును హత్తుకుంటాయి. కొండపల్లి శేషగిరిరావు, పండగ సాయన్న, కట్టమంచి, కొమురం భీం, 'గురూజీ' గురువు ఎల్లప్ప, వడ్డేపల్లి సుధాకర్, దామరాజు పుండరీకాక్షుడు వంటి ఎంతోమంది 'చరిత్ర' విస్మృతికి గురైనా, ఇప్పటికీ నిటారుగా నిలబడ్డ వారి గురించిన కొత్త సంగతులు ఆసక్తిని, ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. అంతేకాదు యురేనియం ప్రాజెక్టుకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటం, గోండీ రాతప్రతుల స్థితిగతులు, కేస్లాపూర్ దర్బారు, చరిత్ర కోల్పోతున్న కోయలు, చెంచు ప్రపంచం, రంగాపురం ఎల్లమ్మ జాతరలతో పాటు స్వీయానుభవంలోకి వచ్చిన అనేక సంగతులను ఈ పుస్తకంలో చర్చించారు తిరుమలరావు. 2011లో వచ్చిన 'తొవ్వ ముచ్చట్లు'కు కొనసాగింపు (రెండోభాగం) ఇది. వ్యాసాల్లో వీలున్నచోట ఫోటోలు కూడా ఉంటే మరింత బావుండేది.

**- చల్లా**

**తొవ్వ ముచ్చట్లు**
జయధీర్ తిరుమలరావు
**పేజీలు:** 252
**వెల:** రూ.150
**ప్రతులకు:**
402, గరోండా అపార్ట్‌మెంట్స్, ఓ.యు ప్రధాన గేటు లైన్-1, డి.డి.కాలనీ, హైదరాబాద్- 500 007




## పురుషాధిక్యాన్ని నిలదీసే కథలు

నాలుగు దశాబ్దాలుగా తెలుగు సాహితీ భాండాగారాన్ని సుసంపన్నం చేస్తున్నవారు వి.ఆర్. రాసాని. ఇప్పుడు 'ముల్లుగర్ర' కథా సంపుటితో మళ్లీ కథా ప్రియుల్ని అలరించడానికి వచ్చారు. ఇది ఆయన ఆరవ కథల సంపుటి. పలువురు ప్రసిద్ధ రచయితలు తమ రచనా వ్యాసంగాన్ని పక్కన పెట్టేసినా రాసాని మాత్రం సృజనాత్మకంగా కథా సృష్టి చేస్తూనే ఉండడం అభినందనీయం. సమాజాన్ని ఇంకా పట్టి పీడిస్తున్న పురుషాధిక్యతకు 'అమ్మా, అమ్మా .. నన్ను చంపెయ్యవూ' కథ ఓ చెంపపెట్టు. ఉద్యోగ మహిళలు ఎదుర్కొనే వేధింపులకు అద్దం పట్టే కథ 'కాంతామణి కాలిమట్టె.' తాగుబోతు వరుడిని ముందే పసిగట్టి అతన్ని తిరస్కరించిన వధువు కథ 'తెల్ల గుర్రం.' సమాజంలోని సమస్యలన్నిటితో పాటు, స్త్రీల పట్ల గౌరవాన్నీ, పురుషాధిక్యత పట్ల తిరస్కారాన్నీ ఈ కథల్లో చక్కగా అభివ్యక్తీకరించారు. ఆయన ఇతివృత్తాలన్నీ వినూత్నంగా అనిపిస్తాయి. సమస్యల పరిష్కారానికి ఎంచుకున్న మార్గాలు ఎంతో వైవిధ్యంతో ఉంటాయి.

**- జి.రాజశుక**




**ముల్లుగర్ర,** డాక్టర్ వి.ఆర్. రాసాని
**పేజీలు:** 252, **వెల:** రూ.170
**ప్రతులకు:** ఫోన్: 040-24224453

**కొత్త పుస్తకాలు**

## దళిత సాహిత్యోద్యమ చిరునామా

మాకొద్దీ నల్లదొరతనమంటూ సమాజంలోని అంటరానితనంపై పోరాటం చేసిన తొలి తరం తెలుగుదళిత కవి కుసుమ ధర్మన్న. రాజమహేంద్రవరంలో ఆయుర్వేద వైద్యుడిగా వృత్తి నిర్వహిస్తూనే అంటరానితనం నిర్మూలనకు సాహిత్య చికిత్స చేశారు. ఇప్పుడు కుసుమ ధర్మన్న రచనలతో పాటూ ఆయన మీద పరిశోధన చేసిన ఇతరుల పుస్తకాలనూ కలిపి ఒక సర్వస్వంగా తీసుకొచ్చింది ప్రజాశక్తి బుక్ హౌస్. ధర్మన్న స్వీయ రచనలతో పాటూ ఆయన రచనలను పరిశోధించిన మద్దుకూరి సత్యనారాయణ గ్రంథం, ధర్మన్న జీవిత విశేషాలు తెలియజేసే పుట్ల హేమలత రచించిన 'కుసుమ ధర్మన్న జీవిత ప్రస్థానం' వంటి పుస్తకాలున్నాయి. గాంధేయ వాదిగా, వాగ్గేయకారుడిగా, ధర్మన్న తన కలాన్ని, గళాన్ని దళిత జనోద్ధరణకు అంకితం చేసిన తీరును వివరించారు రచయితలు. తెలుగు సాహిత్యానికి సంబంధించినంత వరకూ దళిత సాహిత్యోద్యమానికి చిరునామా ధర్మన్న. ఆయన జీవితంపై మరింత పరిశోధన చేయడం ద్వారా, దళిత సాహిత్య, రాజకీయోద్యమాల గురించి అనేక వాస్తవాలు తెలుసుకునే అవకాశముంది.

**- చందు**




**కుసుమ ధర్మన్న రచనలు** (ఏడు పుస్తకాల సంకలనం)
**రచయితలు :** మద్దుకూరి, పుట్ల హేమలత తదితరులు
**ప్రతులకు :** ప్రజాశక్తి, ఫోన్ - 08666-2577533

**ఇవీ వచ్చాయి**

**ఈ యుగం మాది** (కవిత్వం)
**పేజీలు :** 484, **వెల :** రూ.500

**దళితుల సామాజిక సాంస్కృతిక చరిత్ర**
**పేజీలు :** 256, **వెల :** రూ.250
**రచన :** డా. కత్తి పద్మారావు
**ప్రతులకు :** 98497 41695

**దసరాబుల్లోడు**
(వి.బి రాజేంద్రప్రసాద్ జీవిత చరిత్ర)
**రచన :** భగీరథ
**పేజీలు :** 152, **వెల :** రూ.155
**ప్రతులకు :** 040-27612928

**మనసు కథలు**
**రచన :** జాలాది రత్న సుధీర్
**పేజీలు :** 184, **వెల :** రూ.80
**ప్రతులకు :** 98494 18009

**దేవరాజు రవి కవితలు**
**పేజీలు :** 96, **వెల :** రూ.70
**ప్రతులకు :** 91608 96463

**మా ఊరి పెద్దర్వాజ** (కవిత్వం)
**సంపా. :** నల్లెల్ల రాజయ్య
**పేజీలు :** 92, **వెల :** రూ.100
**ప్రతులకు :** ఇం.నెం.7-1-384/6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్-506001

**కానుక** (ఆధునిక బాలల అద్భుత సాహస కాల్పనిక నవల)
**రచన :** డా. వి.ఆర్. శర్మ, **పేజీలు :** 51, **వెల :** రూ.50

**పాయల పాయల యజ్ఞం** (నవల)
**రచన :** బి.ఎస్.ఎం. కుమార్,
**పేజీలు :** 290, **వెల :** రూ.100

**అక్షర 'దండి' యాత్ర** (కవితా సంకలనం)
**రచన :** దండి వెంకట్, **పేజీలు :** 204, **వెల :** రూ.80

**పూర్ణిమ , రచన :** ఆచార్య శేషయ్య కందమూరు
**పేజీలు :** 222, **వెల :** రూ.125
పై అన్ని పుస్తకాలకు
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

## సైనసైటిస్, ఆస్తమా శాశ్వతంగా పోతాయి

**సైనసైటిస్, ఆస్తమా** దీర్ఘకాలం వేధించే జబ్బులని చాలా మంది అనుకుంటారు. కానీ హోమియోలో శాశ్వతంగా తగ్గించే వీలుంది. సైనస్‌లో ఉండే డిఫెన్స్ మెకానిజం చాలా వరకు సూక్ష్మక్రిములు శరీరంలోకి రాకుండా అడ్డుకుంటుంది. కానీ 5 మైక్రాన్ల కన్నా తక్కువ ఉండే పార్టికల్స్ సైనస్‌లో ఆగకుండా నేరుగా ఊపిరితిత్తుల్లోకి వెళ్లిపోతాయి. వీటిని బయటకు పంపించడానికి శరీరం ప్రయత్నిస్తుంది. ఫలితంగానే తుమ్ములు వస్తుంటాయి. అంతేకాకుండా పెస్టిసైడ్స్ ఉపయోగించిన పదార్థాలు తీసుకోవడం, ప్రిజర్వేటివ్స్ వాడిన ఆహారపదార్థాలు తినడం, వాతావరణ కాలుష్యం, ఇంట్లో పరిసరాలు శుభ్రంగా లేకపోవడం, దుమ్ము, ధూళి ఎక్కువగా ఉండే ప్రదేశాల్లో ఉండటం వంటివి సైనస్ సమస్యకు, ఆస్తమాకు కారణమవుతాయి.

**లక్షణాలు :** సైనసైటిస్‌లో ముక్కు దిబ్బడ, తలనొప్పి, ముక్కులో నుంచి దుర్వాసన వంటి లక్షణాలుంటాయి. ఆస్తమాలో కనిపించే ప్రధాన లక్షణాలు దగ్గు, ఆయాసం. పిల్లికూతలు కూడా ఉంటాయి. కొంత మందిలో దగ్గు మాత్రమే ఉంటుంది. దీంతోపాటు ఛాతీ పట్టేసినట్లుగా ఉంటుంది.

**హోమియోతోదూరం**

వేటివల్ల సైనసైటిస్, ఆస్తమా లక్షణాలు ఎక్కువ వుతున్నాయో గుర్తించి వాటికి దూరంగా ఉండాలి. జీవనవిధానం మార్చుకోవడంతో పాటు హోమియో చికిత్స తీసుకుంటే సైనస్, ఆస్తమా శాశ్వతంగా పోతాయి. మూల కారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది.

**Dr. K Ravikirane**

**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**

గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్

**మాస్టర్స్ హోమియోపతి**

అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి

ఫోన్ : 7842 106 106, 9032 106 106

V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి

సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి

10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## హెర్పిస్ బాధకు ఇక సెలవు

**అతి** సూక్ష్మమైన వైరస్ హెర్పిస్. జీవితాంతం బాధించే ఈ వైరస్‌ను హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ అంటారు. ఇది రెండు రకాలు.

హెచ్‌ఎస్‌వి 1 : ఇది నోటి దగ్గర పొక్కుల రూపంలో బయటపడుతుంది. పెదవుల చుట్టూ తెల్లని నీటిపొక్కులలాగా కనిపిస్తుంది. ఎక్కువగా పిల్లల్లో కనిపిస్తుంది. సాధారణంగా ఇవి వచ్చిపోతూ ఉంటాయి.

హెచ్‌ఎస్‌వి 2 : జననావయవాల దగ్గర పొక్కులతో బయటపడుతుంది. దీనినే జెనిటల్ హెర్పిస్ అంటారు. చిన్న చిన్న నీటి పొక్కులలాగా వచ్చి పగిలిపోతుంటాయి. తగ్గినట్టే తగ్గి తిరిగి రావడం జరుగుతుంది.

హెర్పిస్ వైరస్ శృంగారం జరిపే సమయంలో వ్యాప్తి చెందుతుంది. కలయిక సమయంలో చర్మం చిట్లినప్పుడు పుండ్లు, గాయాల ద్వారా ఈ వైరస్ వ్యాపిస్తుంది. శరీరంలోకి ప్రవేశించిన ఈ వైరస్ కొద్దిరోజుల్లోనే ప్రభావం చూపిస్తుంది. రోగిలోని రోగనిరోధకవ్యవస్థ బలహీనపడినపుడు మానసిక ఆందోళన, శారీరక ఆందోళన ఉన్నప్పుడు వాతావరణ పరిస్థితులు మారినపుడు ఏదైనా తీవ్రమైన అనారోగ్య సమస్యలు వచ్చినపుడు సునామిలాగా విజృంభిస్తుంది.

**హోమియో చికిత్స :** హెర్పిస్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. ఈచికిత్స మూల కారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టదు. అనుభవజ్ఞుడైన హోమియో వైద్యుని దగ్గర చికిత్స తీసుకుంటే హెర్పిస్ శాశ్వతంగా తరిమేయవచ్చు.

## హెచ్‌ఐవి ఉన్నా హోమియోతో జీవితం

**హెచ్‌ఐవి** పేరు వింటనే తెలియని భయం. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులు అందుబాటులో ఉన్నాయి. హెచ్‌ఐవి అంటే ఒక వ్యాధి అని చెప్పడం కన్నా వ్యాధులు రావడానికి కారణమయ్యే వాతావరణాన్ని శరీరంలో కలగజేస్తుందని చెప్పవచ్చు. అంటే చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. ఫలితంగా మృత్యువు చేరువవుతుంది. అంటే రోగనిరోధక వ్యవస్థ బలహీనపడితే వ్యాధులు వచ్చిపడతాయి. బలంగా ఉంటే హెచ్‌ఐవి ఏమీ చేయలేదు. సరిగ్గా హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేయడం పైనే దృష్టి పెడుతుంది.

**లక్షణాలు :** హెచ్‌ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్లు పడుతుంది.

**హోమియో చికిత్స :** హోమియో మందుల వల్ల రోగనిరోధకవ్యవస్థ తిరిగి బలపడుతుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హోమియో మందులు సక్రమంగా తీసుకుంటే

## హెపటైటిస్ పీడ ఇలా వదిలింది

**నా పేరు భాను.** నా వయస్సు 35 సంవత్సరాలు. ప్రభుత్వ ఉద్యోగం. మంచి జీతం, లైఫ్ హ్యాపీగా ఉంది అనుకుంటున్న సమయంలో అకస్మాత్తుగా ఒక సమస్య మొదలయ్యింది. మరికొన్ని రోజులు అలస్యమైతే ప్రాణాలు కూడా పోయేవి. ఇంతకీ నా అనారోగ్య లక్షణాలు ఎలా మొదలయ్యాయంటే... ప్రారంభంలో నీరసంగా ఉండటం, ఆకలి లేకపోవడం, ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. డాక్టర్‌కు చూపిస్తే పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని చెప్పారు. ఫ్యాటీలివర్ సమస్య కూడా ఉందన్నారు. దాంతో నాకు ఒక్కసారిగా పాతాళంలో కూరుకుపోయినట్టిగా అనిపించింది. కాలేయ వ్యాధులతో చనిపోతున్న వారి వార్తలు రోజు వింటూనే ఉన్నాను. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. దాంతో ఆగమేఘాల పరిగెత్తుకుంటూ డాక్టర్ రవికిరణ్ గారి దగ్గరకు వెళ్లాను.

**చికిత్స తరువాత**

హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్ గారు ధైర్యం చెప్పారు. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. నెల రోజుల తరువాత చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. ఫ్యాటీలివర్ పూర్తిగా తగ్గిపోయింది. జీవితం ముగిసిందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపింది. ప్రస్తుతం యథావిధిగా జాబ్‌కు వెళుతున్నాను. నాకు కొత్త జీవితం ప్రసాదించినందుకు డాక్టర్‌గారికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు.

ADVT

